# దాశరథీ శతకము

కంచర్ల గోపన్న ప్రణీతము

మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రిగారి

[illegible]త్పర్య సహితము



యస్. అప్పలస్వామి అండ్ సన్సు

బుక్సెల్లర్సు అండ్ పబ్లిషర్సు

రాజమండ్రి.

**1945**

వెల 0-8-0

శ్రీ రస్తు

# దాశరథీ శతకము

(గోపనకవి ప్రణీతము)

పండిత, మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రిగారి

టీకాతాత్పర్య సహితము.



పబ్లిషర్సు:

యస్. అప్పలస్వామి అండ్ సన్సు,

బుక్సెల్లర్సు అండ్ పబ్లిషర్సు

రాజమండ్రి

1945



[వెల 0-8-0

# పీఠిక

ఈ శతకము నాంధ్ర దేశమున రామభక్తాగ్రేసరుండని ఖ్యాతినందిన కంచెర్ల గోపన్నకవీంద్రునిచే రచియింపబడినది. రామభక్తిని నుద్దేశింపఁజేయు శతకము లనేకముల నున్నను ననేక కారణములచే నియ్యది యందు మున్ముందుఁ బేర్కొన దగినది. ఏలనన నీ కవి బాల్యమునుండియు రామభక్తుఁడై జీవితము నంతను రామ కైంకర్యమునందే గడపినవాఁడు. కవిత్వమునకు యతిప్రాసములే వడికట్టురాళ్ళు కావు. భావోద్రేకము ముఖ్యముగా నుండవలయును. అట్టి భావోద్రేకముతో గూడిన భక్త్యావేశముతో నీ పద్యములు రచింపఁ బడినవి. తెలుఁగునాట వందలాది యేండ్లనుండి యీశతకము ప్రచారములోనుండి యాంధ్రుల మన్నన లందినది. ఇంకను నందుచున్నది. అందఁగలదు. గోపన్న పేరు సువర్ణాక్షరములతో నెంతకాలము తెలుఁగునాట వెలుగొందుచుండునో యంతవఱ కీశతకము తెనుఁగు సారస్వతమున వెలయుచుండవలసినదే. ఎత్తుగడలోను, ముగింపులోను నెట్టి భావగాంభీర్య మున్నదో కొన్ని పద్యములు కంఠస్థములు చేసిన తెలియఁగలదు. భక్తి కల ప్రతిమానవుఁడుఁ దెలుగుదేశమున నవిద్యావంతుఁడైనను దాశరథీశతకములోని గొన్ని పద్యములు వచ్చియుండును. బాల బాలికలచే నర్థయుక్తముగ నీశతకమును జదివించిన నెట్టియుపకృతి కలుగునో వ్రాయుటకు మాటలుచాలవు. దానికి దోహద మిచ్చుటే మా యాశయము.

ఇట్లు,

ప్రకటనకర్తలు



శ్రీ ర స్తు

# దాశరథీ శతకము

ఉ. శ్రీరఘురామ చారుతులసీదళదామ శమక్షమాది శృం
గార గుణాభిరామ త్రిజగన్నుత శౌర్యరమాలలామ దు
ర్వార కబంధరాక్షస విరామ జగజ్జన కల్మషార్ణవో
త్తారకనామ భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ! 1

టీ. శ్రీరఘురామ = ఐశ్వర్యముతోఁగూడిన రఘువంశమున జన్మించిన రామా! చారు = అందమైన, తులసీదళ = తులసీదళములతోఁ గూర్పబడిన, దామ = మాలికలు గలవాఁడా! శమ = శాంతము, క్షమ = ఓర్పు, ఆది = మొదలగు, శృంగార = భూషణంబులగు, గుణ = మంచి గుణములచే, అభిరామ = మనోహరుఁడైనవాఁడా! త్రిజగత్ = మూఁడు లోకములచే, నుత = పొగడఁబడిన, శౌర్యరమాలలామ = పరాక్రమలక్ష్మి భూషణముగఁ గలవాఁడా! దుర్వార = అడ్డశక్యముకాని, కబంధరాక్షస = కబంధుఁడను రక్కసుని, విరామ = మట్టుబెట్టినవాఁడా! జగత్ = లోకమందలి, జన = ప్రజలను, కల్మష = పాపమనెడి, అర్ణవ = సముద్రమునుండి, ఉత్తారక = దాటింపఁజేయఁగల, నామ = పేరు కలవాఁడా!, భద్రగిరి దాశరథీ=భద్రాచలమందుండు దశరథమహారాజు పుత్రుఁడా!, కరుణాపయోనిధీ = దయకు సముద్రమువంటివాఁడవైన రామా!

తా. ఐశ్వర్యముతో నొప్పు రఘువంశమున జనించినవాఁడవును, అందమైన తులసిమాలికలను కంఠమున దాల్చినవాఁడవును, శాంతము మొదలగు

మంచిగుణము లలంకారముగనుండి మనోహరమైనవాఁడవును, మూఁడులోక ములు కొనియాడఁదగిన పరాక్రమ లక్ష్మిని భూషణముగఁ దాల్చినవాఁడవును, బలవంతుఁడైన కబంధుఁడనెడి రాక్షసుని జంపినవాఁడవును, ప్రపంచమందలి జనులను పాపపు సముద్రమును దాటింపఁగల పేరుతో నొప్పువాడవు, దయా సముద్రుఁ డవునగు భద్రాచలమున నివసించు దశరథరాజనందనా.

ఉ. రామ విశాల విక్రమ పరాజిత భార్గవరామ సద్గుణ
స్తోమ పరాంగనావిముఖ సువ్రతకామ వినీలనీరద
శ్యామ కకుత్స్థవంశ కలశాంబుధిసోమ సురారి దోర్బలో
ద్దామ విరామ భద్రగిరిదాశరథీ కరుణాపయోనిధీ! 2

టీ. రామా = అందఱను రమింపఁజేయువాఁడా!, విశాల = విస్తార మైన, విక్రమ = పరాక్రమముచే, పరాజిత = ఓడింపఁబడిన, భార్గవ రామా = పరశురాముఁడు గలవాఁడా!, సద్గుణస్తోమ = మంచిగుణముల సమూహము కలవాఁడా!, పరాంగనా = ఇతరస్త్రీలను, విముఖ = చూడని వాఁడా!, సువ్రతకామ=మంచివ్రతమునే కోరువాఁడా!, వినీలనీరదశ్యామ = మిగుల నల్లనైన మేఘమువంటి చామనచాయదేహము కలవాఁడా!, కకుత్స్థ వంశ=కకుత్స్థకులమనెడి, కలశాంబుధి=పాలసముద్రమునకు, సోమ = చంద్రుని వంటివాఁడా!, సురారి = దేవవిరోధులైన రాక్షసులయొక్క, దోర్బలో ద్దామ = గొప్పదైన భుజబలమును, విరామ = అణఁచినవాఁడా!, భద్రగిరి= భద్రాచలమందుండు, దాశరథీ = దశరథునియొక్క కుమారుఁడా!, కరుణా పయోనిధీ = దయకు సముద్రమువంటివాఁడా!

తా. గొప్ప పరాక్రమముచేఁ బరశురాము నోడించి పరస్త్రీలవంక మోహమైన నెత్తిచూడనివాఁడవై, సుగుణరాశివై మంచివ్రతముచే కోరుచు నల్లని మేఘమువంటి శరీరకాంతితో నొప్పువాఁడవై కకుత్స్థవంశమనెడి పాల సముద్రమునకుఁ బూర్ణచంద్రుండవై, రాక్షసుల భుజబలము నణంచుటలో దిట్టవై దయాతరంగుఁడవైన శ్రీరామా.

చ. అగణిత సత్యభాష శర♦ణాగతపోష దయాలసజ్ఝరీ
విగళిత సమస్తదోష పృథి♦వీసురతోష త్రిలోకపూతకృ
ద్గగనధునీమరందపద♦కంజవిశేష మణిప్రభాధగ
ద్ధగితవిభూష భద్రగిరి♦దాశరథీ కరుణాపయోనిధీ! 3

టీ. అగణిత = లెక్కింప శక్యముగాని, సత్యభాష = నిజమైన పలుకులు కలవాఁడా!, శరణాగత = రక్షణఁ గోరివచ్చినవారిని, పోష = రక్షించువాఁడా!, దయా = దయయను, లసత్ = ప్రకాశించు, ఝరీ = ప్రవాహముచే, విగత = పోఁగొట్టఁబడిన, సమస్తదోష = అన్ని పాపములు కలవాఁడా!, పృథివీసురతోష = బ్రాహ్మణుల కానందము కలిగించువాఁడా!, త్రిలోక = స్వర్గమర్త్య పాతాళంబులనెడి మూఁడు లోకములను, పూతకృత్ = పవిత్రమొనరించు, గగనధునీ = ఆకాశగంగయనెడి, మరంద = మకరందముగల, పదకంజ విశేష = పద్మములవంటి పాదములు కలవాఁడా!, మణిప్రభా = రత్నకాంతులచే, ధగద్ధగిత = ధగధగ మెఱయు, విభూష = నగలు కలవాఁడా! భద్రగిరి = భద్రాచలమందుండు, దాశరథీ = రామా!, కరుణాపయోనిధీ = దయాసముద్రుఁడా!

తా. లెక్కింప నలవికానన్ని సత్యపుఁబలుకులు కలవాఁడవు, శరణన్న వారిని రక్షించువాఁడవు, దయాప్రవాహముచే సమస్త పాపముల నశింపజేయు వాఁడవు, బ్రాహ్మణుల కానందముఁ గలిగించువాఁడవు, మూఁడులోకములను పవిత్ర మొనరించు నాకాశగంగను పాదమునందు ధరించినవాఁడవు, ధగధగ మని ప్రకాశించు రత్నాలంకారములు గలవాఁడవునైన భద్రాచలరామా!

ఉ. రంగదరాతిభంగ ఖగ♦రాజతురంగ విపత్పరంపరో
త్తుంగతమఃపతంగ పరి♦తోషితరంగ దయాంతరంగ స
త్సంగ ధరాత్మజాహృదయ♦సారసభృంగ నిశాచరాబ్జమా
తంగ శుభాంగ భద్రగిరి♦దాశరథీ కరుణాపయోనిధీ! 4

టీ. రంగత్ = ప్రకాశించు, అరాతి = శత్రువులను, భంగ = భంగపఱచిన వాఁడా! ఖగరాజ = పక్షిరాజైన గరుడుఁడు, తురంగ = గుఱ్ఱముగాఁ గల వాఁడా! విపత్పరంపర = కష్టములవరుసచే, ఉత్తుంగ = పొడవైన, తమః = చీకటికి, పతంగ = సూర్యుఁడా!, పరితోషిత = మిగుల సంతోషించు, రంగ = రంగనాథుఁడు కలవాఁడా!, దయాంతరంగ = దయతోఁ గూడిన మనసు కలవాఁడా!, సత్సంగ = సజ్జనసాంగత్యము కలవాఁడా!, ధరాత్మజా = సీతాదేవియొక్క, హృదయ = మనస్సనెడి, సారస = తామరపద్మమునకు, భృంగ = తుమ్మెదవంటివాఁడా!, నిశాచర = రాక్షసులనెడి, అబ్జ = పద్మములకు, మాతంగ = ఏనుఁగువంటివాఁడా!, శుభాంగ = మంగళప్రదమైన శరీరము కలవాఁడా!, భద్రగిరి........పయోనిధీ!

తా. గర్వోన్మత్తులైన శత్రువుల గర్వమణచినవాఁడవు, గరుడవాహనుండవు, భక్తుల పాపమనెడు చీకటికి సూర్యుఁడవు, ఇక్ష్వాకువంశీయుల కుల దేవుఁడైన రంగనాథుని పూజించి తృప్తిపఱచువాఁడవు, భక్తులయెడ మిగుల దయకలవాఁడవు, సజ్జన సాంగత్యము చేయువాఁడవు, సీతాదేవి హృదయ పద్మమునకుఁ దుమ్మెద వంటివాఁడవు, రాక్షసులను మదపుటేనుఁగు పద్మములను పెకలించు రీతి చంపువాఁడవు, దివ్యమంగళ విగ్రహుండవునై భద్రగిరిని వసించు దయాంతరంగుఁడవైన శ్రీరామచంద్రా.

ఉ. శ్రీద సనందనాది ముని♦సేవితపాద దిగంతకీర్తిసం
పాదన సమస్తభూతపరి♦పాల వినోద విషాదవల్లికా
చ్ఛేద ధరాధినాథకుల♦సింధుసుధామయపాద నృత్తగీ
తాదివినోద భద్రగిరి♦దాశరథీ కరుణాపయోనిధీ ! 5

టీ. శ్రీద = భాగ్యము లొసంగువాఁడా!, సనందనాది = సనందనుఁడు మొదలగు, ముని = ఋషులచే, సేవిత = సేవింపఁబడిన, పాద = పాదములు గలవాఁడా!, దిగంత కీర్తిసంపాద = దిక్కుల తుదవఱకు కీర్తిని వ్యాపింపఁ జేసినవాఁడా!, సమస్తభూత = సర్వప్రాణులను, పరిపాలన = రక్షించుట

యందు, వినోద = వేడుక కలవాఁడా!, విషాద = వ్యసనమనెడి, వల్లికా = తీఁగను, ఛేద = తెగగొట్టినవాఁడా!, ధరాధినాథ = రాజులయొక్క, కుల సింధు=వంశమనెడి సముద్రమునకు, సుధామయపాద=చంద్రునివంటివాఁడా!, నృత్త = నృత్యము, గీత=సంగీతము, ఆది = మొదలగువానియందు, వినోద = ఆసక్తికలవాఁడా!, భద్రగిరి.........పయోనిధీ!

తా. భక్తులకు భాగ్యము లిచ్చువాఁడవు, సనందనాది మహామునులచే సేవింపఁ బడువాఁడవు, దిక్కులన్నింటను వ్యాపించిన కీర్తి నార్జించినవాఁడవు, ప్రాణుల నన్నిటిని రక్షించుటయం దుత్సాహము కలవాఁడవు, రాజ వంశమను సముద్రమునకుఁ జంద్రుని వంటివాఁడవై సంతోషపఱచువాఁడవు, భద్రాద్రియందు వసించువాఁడవునైన శ్రీరామచంద్రా!

ఉ. ఆర్యులకెల్ల మ్రొక్కి వినతాంగుఁడనై రఘునాథభట్టరా
చార్యులకంజలెత్తి కవిసత్తములన్ వినుతించి కార్యసౌ
కర్యమెలర్ప నొక్క శతకంబొనఁగూర్చిరచింతు నేఁడు తా
త్పర్యమునన్ గ్రహింపు మిది దాశరథీకరుణాపయోనిధీ! 6

టీ. ఆర్యులకు + ఎల్లన్ = పూజింపఁదగినవారి కందఱకును, మ్రొక్కి = నమస్కరించి, వినతాంగుఁడనై = శరీరమును వంచినవాఁడనై, రఘునాథభట్టర్ = రఘునాథభట్టరను, ఆచార్యులకు = గురువులకు, అంజలెత్తి = దోసిలొగ్గి, కవిసత్తములన్ = కవిశ్రేష్ఠులను, వినుతించి = పొగడి, కార్యసౌకర్యము = ఆయాసము లేకుండ కార్యము, ఎలర్పన్ = సిద్ధించునట్లుగా, ఒక్కశతకంబు = నూఱు పద్యములు కలశతకము, ఒనగూర్చి = జతపఱచి, రచింతున్=చేసెదను; నేఁడు = ఈ దినము, ఇది=ఈశతకము, తాత్పర్యమునన్=ఇష్టముతో, గ్రహింపుము=తెలిసికొనుము. దాశరథీ...... కరుణాపయోనిధీ.

తా. శ్రీరామచంద్రా! నేను తలపెట్టిన పనిక్రమముతప్పకుండగ నెఱవేఱుటకుగాను, పూజనీయులైనవారి కందఱకును మ్రొక్కి యాచార్యులైన

రఘునాథభట్టరునకు వినయముతో దోసిలొగ్గి నమస్కరించి యీ శతకమును రచించి మీకు సమర్పించుకొందును. దయతో దీనిని గైకొనుము.

చ. మసగొని రేగుబండ్లకును ♦ మౌక్తికముల్ వెలవోసినట్లు దు
ర్వ్యసనముఁ జెంది కావ్యమును ♦ రాత్ములకిచ్చితి మోసమ
య్యె నా। రసనకుఁ బూతవృత్తి సుక ♦ రంబుగఁ జేకురునట్లు
వాక్సుధా।రసములు చిల్కఁ బద్యముఖ ♦ రంగమునందు నటింప
వయ్య సం। తసమును జెంది భద్రగిరి ♦ దాశరథీ కరుణాప
యోనిధీ! 7

టీ. మసకొని = ఆశపడి, రేగుపండ్లకు, మౌక్తికముల్ = ముత్యములు, వెలవోసినట్లు = విలువగా నిచ్చిన పగిది, దుర్వ్యసనమున్ = దురాశను, చెంది = పొంది, కావ్యము = కవిత్వము, దురాత్ములకు = పాపులకు, ఇచ్చితిన్ = అంకిత మిచ్చితిని. మోసము = వంచన, అయ్యెన్ = అయినది, నారసనకున్ = నా నాలుకకు, పూతవృత్తి = పవిత్రవర్తనము, సుకరంబుగన్ = సులభముగా, చేకురునట్లు = దొరకునట్లు, వాక్సుధారసములు = మాటలనెడి యమృతపుఁజినుకులు, చిల్కన్ = చిల్కునట్లు, పద్యముఖరంగమునందు = పద్యముకల ముఖమను రంగప్రదేశమునందు, సంతసమును = సంతోషమున, చెంది = పొంది, నటింపవయ్యా = నాట్యము చేయుమయ్యా, భద్రగిరి.........పయోనిధీ.

తా. ఓ శ్రీరామచంద్రా! ముత్యముల నిచ్చి రేగుపండ్లను కొన్నట్లుగ డబ్బునకాసపడి దురాత్ములకు కావ్యమును అంకితమిచ్చి మోసపడితిని. అందుచే నీవు నాముఖమనెడి రంగస్థలమున నటింపుము మనుజాలను పొగడుటచే పాపపంకిలమైన నా నాలుకకు పవిత్రత జనించునట్లు అమృతముతో సమానములు, పరిశుభ్రములునైన వాక్యములు చిందునట్లు సేయుము.

ఉ. శ్రీరమణీమనోహర యతీ ♦ నీసుమాభశరీర భక్తమం
దార వికారదూర పర ♦ తత్త్వవిహార త్రిలోకచేతనో

ద్ధార దురంతపాతక వితాన విదూర ఖరాదిదైత్య కాం
తారకుఠార భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 8

టీ. శ్రీ = కాంతిచే, రమణీయ = అందమైన, హార = ముత్యాలహారములు గలవాఁడా!, అతసీకుసుమ = నల్లయవిసెపూవునకు, అభ = సమానమైన, శరీర = శరీరము గలవాఁడా!, భక్తమందార = భక్తుల కోర్కెలను దీర్చుటకుఁ గల్పవృక్షమైనవాఁడా!, వికారరూప = వికారము లేని, పరతత్త్వవిహార = పరబ్రహ్మ పదార్థమై విహరించువాఁడా!, త్రిలోక = మూఁడు లోకములందలి, చేతన = ప్రాణులను, ఉద్ధార=ఉద్ధరించువాఁడా!, దురంత = అంతములేని, పాతక వితాన = పాపపుంజమునకు, విదూర=చాల దూరమైనవాఁడా!, ఖరాది=ఖరుఁడు మొదలగు, దైత్య = రాక్షసులనెడి, కాంతార = అరణ్యమునకు, కుఠార = గండ్రగొడ్డలి వంటివాఁడా!, భద్రగిరి.........పయోనిధీ.

తా. కాంతియు నందము గలరత్నహారములను ధరించి, నల్లయవిసె పూవువంటి శరీరకాంతితో నొప్పుచు భక్తులకు కల్పవృక్షమవై కోరికలను దీర్చుచు వికారరహితుఁడవు, పరబ్రహ్మపదార్థమవునై ముల్లోకములందలి జీవులను రక్షింపుచు నంతములేని పాపరాశికి దూరముగా నుండువాఁడవై ఖరాదిరాక్షసులనెడి యడవికి గండ్రగొడ్డలివంటివాఁడవై సంహరించి భద్రాచలమందుండు శ్రీరామచంద్రా.

చ. దురితలతాలవిత్ర ఖర ♦ దూషణకాననవీతిహోత్ర భూ
భరణకళావిచిత్ర భవ ♦ బంధవిమోచన సూత్ర చారు వి
స్ఫురదరవిందనేత్ర ఘన ♦ పుణ్యచరిత్ర వినీల భూరి కం
ధరసమగాత్ర భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 9

టీ. దురిత = పాపమనెడి, లతా = తీఁగకు, లవిత్ర = కొడవలియైన వాఁడా!, ఖరదూషణ = ఖరదూషణ రాక్షసులనెడి, కానన = అరణ్యమునకు, వీతిహోత్ర = అగ్నియైనవాఁడా!, భూభరణ=భూభారమునువహించు, కళా = విద్యచే, విచిత్ర = ఆశ్చర్యకరమైనవాఁడా!, భవబంధ = సంసార

మనెడి ప్రాటిని, విమోదన = విప్పుటకు, సూత్రి = ఆధారమైనవాఁడా! చారు = అందమై, విస్ఫురత్ = ప్రకాశించు, అరవింద = పద్మములవంటి, నేత్ర=కన్నులు కలవాఁడా!, ఘనపుణ్యచరిత్ర=గొప్పపవిత్రమైన చరితముగల వాఁడా!, వినీల = మిగుల నల్లనై, భూరి=గొప్పదైన, కంధర=మేఘమునకు, సమ=సాటివచ్చు, గాత్ర=దేహము గలవాఁడా!, భద్రగిరి......పయోనిధీ.

తా. పాపమను తీఁగకుఁ గొడవలి వంటివాఁడవై కోయువాఁడవు, దుష్టులైన ఖరదూషణాది రాక్షసులనెడి యడవిపాలిటికి నగ్నివై కాల్చినవాఁడవు, భూభారమును దాల్చు విద్యలో నాశ్చర్యమును జూపువాఁడవు, సంసారబంధమును విడగొట్టుట కార్యదర్శిప్రాయుండవు, బాగుగా వికసించి ప్రకాశించు తామరపూలవంటి కన్నులు కలవాఁడవునై భద్రాదినుండు శ్రీరామచంద్రా.

చ. కనకవిశాలచేల భవ ♦ కానన శాతకుఠారధార స
జ్జనపరిపాలశీల దివి ♦ జస్తుత సద్గుణకాండకాండ సం
జనిత పరాక్రమక్రమ వి ♦ శారద శారద కందకుంద చం
దనఘనసారసారయశ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 10

టీ. కనక = బంగారముచే, విశాల = వెడల్పయిన, చేల=వస్త్రము గలవాఁడా!, భవ = సంసారమనెడి, కానన = అరణ్యమునకు, శాత = పదునైన, కుఠారధార = గండ్రగొడ్డలివాదరైనవాఁడా!, సజ్జన=మంచివారిని, పరిపాల = బాగుగా రక్షించు, శీల = స్వభావము గలవాఁడా!, దివిజ = దేవతలచే, స్తుత = పొగడఁబడిన, సద్గుణ = మంచి గుణములయొక్క, కాండ = సమూహము కలవాఁడా!, కాండ = బాణమునందు, సంజనిత = పుట్టు, పరాక్రమ=శూరత్వముయొక్క, క్రమ=వరుసయందు, విశారద=నేర్పు గలవాఁడా!, శారద=శరత్కాలమందలి, కంద=మేఘమట్లు, కుంద=మొల్లపూవు గ్గరీతిని, చందన=మంచిగంధముపోల్కి, ఘనసార=కర్పూరముచందమున, సార=సారవంతమైన, యశః = కీర్తిగలవాఁడా! దాశరథీ........పయోనిధీ.

తా. వెడల్పయిన బంగారుబట్టను ధరించినవాఁడవు, భూట్టుకయనెడి యరణ్యమును గండ్రిగొడ్డలితో నఱకి జన్మరాహిత్యము చేయువాఁడవు, సజ్జనుల రక్షించు ప్రకృతి కలవాఁడవు, దేవతలు పొగడదగిన మంచిగుణములతో నొప్పువాఁడవు, బాణసంజనితమగు విక్రమమున నేర్పరివి, శరత్కాలమేఘమట్లు, వెండి కొండవలెనిది, మంచిగంధము, కర్పూరమువలె తెల్లనైన కీర్తికలవాఁడవునైన భద్రాద్రిరామా.

ఉ. శ్రీరఘువంశతోయధికి♦సీతమయూఖుఁడవైన నీపవి
త్రోరుపదాబ్జముల్ వికసి♦తోత్పలచంపకవృత్తమాధురీ
పూరితవాక్ప్రసూనములఁ♦బూజలొనర్చెదఁజిత్తగింపుమీ
తారకనామ భద్రగిరి♦దాశరథీ కరుణాపయోనిధీ! 11

టీ. శ్రీ = శోభాయమానమగు, రఘువంశతోయధికి=రఘువంశమనెడి సముద్రమునకు, శీతమయూఖుఁడవైన = చల్లని కిరణములు గల చంద్రుండవైన, నీ = నీదగు, పవిత్ర = పరిశుభ్రములైన, ఉరు = గొప్పవగు, పదాబ్జముల్ = పద్మములవంటి పాదములను, వికసిత = వికసించిన, ఉత్పల = ఉత్పలమాలలు, చంపక = చంపకమాలలుననెడి, వృత్త = పద్యములందలి, మాధురీ = తియ్యదనముచే, పూరిత = నింపఁబడిన, వాక్ప్రసూనములన్ = వాక్యములనెడి పుష్పములచే, పూజలు=అర్చనలు, ఒనర్చెదన్ = చేసెదను, చిత్తగింపుమీ = గ్రహింపుమా!, తారకనామ = భక్తులను సంసారసముద్రమునుండి దాటింపఁజేయు పేరుగల, భద్రగిరి.........దాశరథీ.

తా. భక్తులను సంసారజలధినుండి యుద్ధరింపఁగల పేరుతో నొప్పు శ్రీరామచంద్రా! రఘువంశమనెడి సముద్రమునకుఁ జంద్రుఁడవైన నీపవిత్ర పాదపద్మంబులను బాగుగాఁ బూసి పరిమళించు ఉత్పలమాల, చంపకమాలలనెడి పద్యములతో నమృతమయములైన వాక్కులనెడి పూవులతో నర్చించెద నను గ్రహించి స్వీకరింపుమా.

చ. గురుతరమైన కావ్యరస•గుంభన కబ్బురమందిముచ్చరుల్
సరసులమాడ్కి సంతసిల•జాలుదురోటు! శశాంక చంద్రికాం
కురముల కుందుకాంతమణి•కోటి స్రవించినభంగివింధ్య భూ
ధరమునజారునే శిలలు • దాశరథీ కరుణాపయోనిధీ! 12

టీ. గురుతరమైన = గొప్పదగు, కావ్య = కావ్య మందలి, రస = శృంగారము మొదలగు రసములయొక్క, గుంభనకు = పొందికకు, అబ్బురము = ఆశ్చర్యము, అంది = పొంది, ముచ్చరుల్ = నీచులు, సరసులమాడ్కి = రసమును గ్రహింపగల్గువారివలె, సంతసిలన్ = ఆనందించుటకు, చాలుదు రోటు = సమర్థులు కాఁజాలరు. శశాంక = కుందేలు చిహ్నముగా గల చంద్రుని, చంద్రికాంకురములకు = తెల్ల వెన్నెలలకు, ఇందుకాంతమణి = చంద్రకాంత మాణిక్యముల, కోటి = సమూహము, స్రవించినభంగి = నీరూరి జారునట్లు, వింధ్య భూధరమునన్ = వింధ్యపర్వతమందలి, శిలలు = రాళ్ళు, జాలునే = కరగి ప్రవహించునా? (ప్రవహింపవు.)

తా. చంద్రుని వెన్నెల మొలకలకుఁ జంద్రకాంతమణులు కరగి నీరై పాఱినట్లు వింధ్యపర్వతమందలి రాళ్ళు కరగి ప్రవహించుట కెట్లు చాలవో యట్లే శృంగారము మొదలయిన రసములచే నిండియున్న మహాకావ్యమును జూచి పండితులు సంతోషించుపగిది మూఢులు సంతసింపఁజాలరుగదా!

చ. తరణికులేశ నానుడుల • దప్పులుగల్గిన నీదునామ స
ద్విరచితమైన కావ్యము ప•విత్రముగాదె వియన్నదీజలం
బరుగుచువంకయైన మలి•నాకృతిబాఱినఁ దన్మహత్వముం
దరమె గణింపనెవ్వరికి • దాశరథీ కరుణాపయోనిధీ! 13

టీ. తరణికులేశ = సూర్యవంశప్రభుఁడవైన రామా!, నానుడులన్ = మాటలందు, తప్పులు = దోసములు, కల్గినన్ = ఉన్నను, నీదునామ = నీ పేర, సత్ = శ్రేష్ఠముగా, విరచితమైన = వ్రాయఁబడినదగు, కావ్యము = కవి

త్వము, పవిత్రముగాదె = పరిశుద్ధమైనదిగాదా!, విణ్ణదీజలంబు = గంగాప్రవాహము, అరుగుచు = ప్రవహించుచు, వంకరయైనన్ = వంకరయైనను, మలినాకృతిన్ = మురికిగలదిగ, పాఱినన్ = ప్రవహించినను, తత్ప్రభావత్వమున్ = దాని గొప్పదనమును, గణింపన్ = పొగడుటకు, ఎవ్వరికిన్ = ఎట్టివారికైనను, తరమె=సాధ్యమా! (సాధ్యము కాదు.)

తా. సూర్యవంశప్రభుండవైన శ్రీరామచంద్రా! నేను నీపేరిట రచించిన కావ్యమునందు దోషములున్నను నది పవిత్రమే యగును. గంగానదీప్రవాహము ఒకచోట వంకరకలదైనను, మురికితోఁగూడినదైనను, దానిగొప్పతనమించుకైనను తగ్గిపోదుగదా!

చ. అజునకు తండ్రివయ్యు సన♦కాదులకుం బరతత్త్వమయ్యు న
ద్విజమునికోటి కెల్లఁ గుల♦దేవతవయ్యు దినేశవంశ భూ
భుజులకు మేటివయ్యుఁ బరి♦పూర్ణుఁడవై వెలుగొందు పక్షి
రాడ్ధ్వజ మిముఁ బ్రస్తుతించెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 14

టీ. అజునకున్ = బ్రహ్మకు, తండ్రివి = జనకుఁడవు, అయ్యున్ = అగుచును, సనకాదులకున్ = సనకుఁడు మొదలగు మునులకు, పరతత్త్వము అయ్యున్ = పరబ్రహ్మరూపుఁడ వగుచును, సద్విజ = బ్రాహ్మణోత్తములకు, మునికోటికిన్ = ఋషిసమూహమునకు, ఎల్లన్ = అందఱకును, కులదేవత వయ్యున్ = వంశమున కంతకు దేవుఁడ వగుచును, దినేశవంశ = సూర్యకుల మందలి, భూభుజులకు = రాజులకు, మేటివయ్యున్=గొప్పవాఁడవగుచును, పరిపూర్ణుఁడవై = అంతటను నిండినవాఁడవై, వెలుఁగొందు = ప్రకాశించు, పక్షిరాడ్ధ్వజ = గరుడధ్వజము కలవాఁడా!, మిమున్ = మిమ్ములను, ప్రస్తుతించెదను = కొల్తును.

తా. బ్రహ్మకుఁ దండ్రివై, సనకాది మునులకుఁ బరలోక సుఖము నొసంగు నధిదేవతవై, బ్రాహ్మణులకు నింటి వేల్పువై, సూర్యవంశపు

రాజులకు మేటికిరీటమవై, యంతటను నిండి ప్రకాశించుచు గర్వదుఁడు టెక్కముగా నొప్పు శ్రీరామచంద్రా! నేను నిరంతరము నిన్నే సేవింతును.

ఉ. పండిత రక్షకుం డఖిల ♦ పాపవిమోచనుఁ డబ్జసంభవా
ఖండలపూజితుండు దశ ♦ కంఠవిలుంఠన చండకాండ కో
దండకళాప్రవీణుఁడవు ♦ తావక కీ_ర్తి వధూటికిత్తుఁ బూ
దండలుగాఁగ నా కవిత ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 15

టీ. పండితరక్షకుండు = జ్ఞానులను కాపాడువాఁడును, అఖిలపాప విమోచనుఁడు = గొప్ప పాపములను బోఁగొట్టువాఁడును, అబ్జసంభవ = పద్మము పుట్టుకగాఁ గల బ్రహ్మచేతను, ఆఖండల = ఇంద్రుని చేతను, పూజితుండు = పూజింపఁబడువాఁడును, దశకంఠ = రావణాసురుని, విలుంఠన = నఱకుటయందు, చండ = తీవ్రమైన, కాండ = బాణములు కల, కోదండకలా = ధనుర్విద్యయందు, ప్రవీణుడు = నేర్పరియు, అను = అనెడి, తావక = నీదైన, కీ_ర్తివధూటికి = కీ_ర్తియనెడి స్త్రీకి, నాకవిత = నాకవిత్వ మును, పూదండలుగాఁగన్ = పూలదండలగునట్లు, ఇత్తున్ = ఇచ్చెదను. దాశరథీ.........పయోనిధీ.

తా. జ్ఞానులను రక్షించువాఁడు, మహాపాతకములను బోఁగొట్టువాఁడు, బ్రహ్మేంద్రాది దేవతలచేఁ బూజింపఁ బడువాఁడు, రావణుని పదితలలను నఱుకశ_క్తిగల వాడిబాణములు కలవాఁడు, ధనుర్విద్యలో నారితేరినవాఁడునై శ్రీరామచంద్రుఁ డొప్పుననెడి నీకీ_ర్తికాంతకు నాకవిత్వమును బూలదండగా నిచ్చెద గ్రహింపుము.

ఉ. శ్రీరమ సీతగాఁగ నిజ ♦ సేవకబృందము వీరవైష్ణవా
చారజనంబుగాఁగ విర ♦ జానది గౌతమిగా వికుంఠము
న్నారయ భద్రశైల శిఖ ♦ రాగ్రముగాఁగ వసించుచేతనో
ద్ధారకుఁడైన విష్ణుఁడవు ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 16

టీ. శ్రీ = సంపదల కధిష్ఠాన దేవతయైన, రమ = లక్ష్మీదేవి, సీతగాఁగన్ = సీతాదేవి కాఁగా, నిజసేవక బృందము = నిజమైన భక్తుల సమూహము, వీరవైష్ణవాచారజనంబుగాఁగన్ = మిగుల నధికమైన వైష్ణవాచార పరులుకాఁగా, విరజానది = విరజయనెడు నది, గౌతమిగాన్ = గోదావరీ తీరము కాఁగా, వికుంఠమున్ = వైకుంఠమును, అరయన్ = విచారింపగా, భద్రశైల = భద్రగిరియొక్క, శిఖరాగ్రముగాఁగన్ = కొండ పై భాగము కాఁగా, వసించి = ఉండి, చేతనోద్ధారకుఁడైన = ప్రాణికోట్లను గాపాడు నట్టివాఁడవైన, విష్ణుఁడవు = సర్వవ్యాపకుఁడవు, దాశరథీ......పయోనిధీ.

తా. శ్రీఆదిలక్ష్మియే సీతాదేవిగను, నీభక్తసమూహమే మిగుల వైష్ణ వాచారపరులగు జనంబులుగను, విరజానదియే గోదావరీతీరముగను, భద్రాచల శిఖరోపరిభాగమే వైకుంఠముగను సర్వవ్యాపకుండవై యుండి ప్రాణికోట్లను గాపాడుటయం దిష్టముకలవాఁడవైన నీవే దశరథపుత్రుఁడవై నెలకొని యున్న శ్రీరామచంద్రా.

ఉ. కంటి నదీతటంబుఁ బొడ ♦ గంటిని భద్రనగాధివాసముం
గంటి నిలాతనూజ నురు ♦ కార్ముకమార్గణశంఖచక్రముల్
గంటిని మిమ్ము లక్ష్మణుని ♦ గంటిఁగృతార్థుఁడనైతి నోజగ
త్కంటక దైత్యనిర్దళన ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 17

టీ. జగత్కంటక దైత్య నిర్దళన=లోకములను బాధించు రాక్షసులను జంపువాఁడవైన శ్రీరామచంద్రా!, నదీతటంబున్ = గోదావరీ నదియొక్క తీరమును, కంటిన్ = చూచితిని; భద్రనగాధివాసమున్ = నీకు వాసస్థాన మైన భద్రాచలమును, పొడఁగంటిని = చూచితిని; ఉరు = గొప్పవైన, కార్ముక=ధనువును, మార్గణ=బాణములను, శంఖచక్రముల్ = శంఖచక్ర ములను, కంటిని = చూచితిని, మిమ్ము = మిమ్మును, లక్ష్మణుని=మీసోద రుని, కంటిన్ = చూచితిని; కృతార్థుఁడను = ధన్యుఁడను, ఐతిని=అయితిని.

తా. క్రూరరాక్షస నాశకుండవైన శ్రీరామచంద్రా! గోదావరీ నదీ తీరమును, నీవు నివసించు భద్రగిరిని, సీతాదేవిని, మీధనుర్బాణ శంఖచక్రా

ద్యాయుధములను, మిత్రు లక్ష్మణుని చూచి సేవించి ధన్యుఁడనైతిని. నా జన్మ తరించినది.

చ. హాలికునకున్ హలాగ్రమున ♦ నర్థము సేకురుభంగి దప్పిచే
 నలమటఁ జెందువానికి సు ♦ రాపగలో జలమబ్బినట్లు దు
 ర్మలిన మనోవికారినగు ♦ మర్త్యునినన్నొడఁగూర్చినీపయిం
 దలఁపు ఘటింపఁజేసితివి ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 18

టీ. దాశరథీ = రామచంద్రా!, హాలికునకున్ = భూమిని దున్నుకొని బ్రతుకువానికి, హలాగ్రమునన్ = నాఁగలికొనయందు, అర్థము = ధనము, సేకుఱుభంగిన్ = లభించుతీరున, దప్పిచేన్ = దాహముచే, అలమటన్ = ఆయాసమును, చెందువానికి = పొందువానికి, సురాపగలోన్ = గంగానదియందు, జలము = నీరు, అబ్బినట్లు = దొరకిన విధమున, దుర్మలిన = పెద్ద పాపములు చేయుటచే మలినమైన, మనః = మనసుచే, వికారిని = మార్పొందినవాఁడను, అగు మర్త్యునిన్ = అయినమానవుని, నన్ను = నన్నును, ఒడఁగూర్చి = బాగుచేసి, నీపయిన్ = నీమీఁద, తలఁపున్ = ధ్యానమును, ఘటింపన్ = కూడునట్లుగా, చేసితివి = చేసినావు.

తా. బంగారునాగలిచే భూమిని దున్నుకొని బ్రతుకువాని కానాగలి కొననే ధనము దొరకినవిధముగను, దాహముచే నల్లాడువానికి గంగోదకము లభించినతీరునను మిగుల పాపకర్ములచేజిక్కి పరితపించు నాకు నీపై తలంపు కలుగ జేసితిని. కావున రామచంద్రా! నేను కృతార్థుండనైతిని.

ఉ. కొంజక తర్కవాదమను ♦ గుద్దలిచేఁ బరతత్త్వభూస్థలిన్
 గఁజిలఁ దవ్వి కన్గొనని ♦ రామనిధానము నేఁడు భక్తిసి
 ద్ధాంజనమందు హస్తగత ♦ మయ్యెబళీయనఁగా మదీయహృ
 త్కంజమునన్ వసింపుమిఁక ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 19

టీ. పరతత్త్వభూస్థలిన్ = పరతత్త్వమనెడి కావును, కొంజక = సంశయించక, తర్కవాదము = విచారపూర్వకము, అనుగుద్దలిచేన్ = గడ్డపార

యనుసాధనమున, త్రివ్వి = పెల్లగించి, కన్గొనని = చూడసాధ్యముకాని, రామనిధానము=శ్రీరామనిధిని, నేఁడు=ఈరోజున, భక్తిసిద్ధాంజనమందు = భక్తియనెడి శాశ్వతమైన కాటుకయందు, భళీయనఁగాక = మేలగునట్లు, హస్తగతము = చేతికి దొంకినది, అయ్యెన్ = అయ్యెను. ఇఁకఁ=ముందు, మదీయహృత్కంజమునన్ = నాహృదయమనెటి పద్మమందు, వసింపుము = నివసించియుండుము.

తా. శ్రీరామచంద్రా! భూమిని గడ్డపారతో దవ్వి నిధిని పొంద సాధ్యపడనట్లు పరతత్త్వవస్తువును తర్కవాదమను గుద్దలిచే త్రివ్వి కనుగొనుట యసాధ్యము. కాని యీఅ చేతియందు అంజనము నుంచుకొని భూమిలోని గనిని సులువుగా గనుగొనశక్యమగునట్లు భక్తియను నంజనమున నిన్ను నా చేతియందున్నవానినిగాఁ జేసికొంటిని. అందుచే జ్ఞానులు మేలని మెచ్చున ట్లిఁక ముందు నీవు నాహృదయపద్మమున నుండుము.

ఉ. రాముఁడు ఘోరపాతక వి ♦ రాముఁడు సద్గుణకల్పవల్లి కా
రాముఁడు షడ్వికారజయ ♦ రాముఁడు సాధుజనావనవ్రతో
ద్దాముఁడురాముఁడేపరమ♦దైవముమాకనిమీయడుంగుగెం
దామర లే భజించెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 20

టీ. దాశరథీ = రామచంద్రా! రాముఁడు = అంతను సంతసపరచు వాఁడు, ఘోర = భయంకరములైన, పాతక=పాపములను, విరాముఁడు = తుదముట్టించువాఁడు, సద్గుణ = మంచి గుణములనెడి, కల్పవల్లిక = కల్ప తరువుతీగెలకు, ఆరాముఁడు =తోటయైనవాఁడు, షడ్వికార = కామక్రోధ ములు మొదలగు నారు వికారములను, జయరాముఁడు = సాధించువాఁడు, సాధుజన = సజ్జనులను, అవన = రక్షించుటయను, వ్రత = వ్రతమందు, ఉద్దాముఁడు = ప్రసిద్ధి నొందినవాఁడైన, రాముఁడే = శ్రీరామచంద్రుఁడే, మాకు, పరమదైవము=ముఖ్యుఁడైన దేవుఁడు, అని=ఈరీతిగా, మీయడుగుఁ గెందామరలే=మీపద్మములవంటి పాదములనే, భజించెదను=కొలుతును.

తా. శ్రీరామచంద్రా! అందఱను తృప్తి నొందించి భయంకరపాపము లను రూపుమాపి మంచి గుణములనెడి తీగలకు తోటవంటివాఁడై కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులను వారు వికారములను జయించి సజ్జనులను గాపాడ గంకణము గట్టుకొన్న ప్రసిద్ధుఁడగు రాముఁడే మాకుఁ బ్రధానదైవ మని నిరతము నీ పద్మములవంటి పాదములనే సేవింతును.

ఉ. చక్కెరమాని వేముదినఁ ♦ జాలినకైవడి మానవాధముల్
పెక్కురుబక్కదైవముల ♦ వేమఱుఁ గొల్చెద రట్లకాదయా
మ్రొక్కిన నీకుమ్రొక్కవలె♦మోక్షమొసంగిన నీవ యీవ
లెం। దక్కినమాటలేమిటికి♦దాశరథీ కరుణాపయోనిధీ! 21

టీ. చక్కెరన్=పంచదారను, మాని=విడిచి, వేమున్=చేదువస్తువును, తినన్=తినుటను, చాలినకైవడిన్=చాలినట్లు, మానవాధముల్=నీచమనుజులు, పెక్కురు=చాలమంది, బక్క దైవములన్ = మోక్షమియ్యలేని దేవతలను, వేమఱున్=అనేకమారులు, కొల్చెదరు=సేవింతురు. అట్లకాదియా=అట్లు చేయ కూడదయ్యా, మ్రొక్కినన్=దండమిడిన, నీకె, మ్రొక్కవలెను=నమస్కరింప వలెను. మోక్షము=ముక్తి, ఒసగివన్=ఇచ్చిన, నీవె=నీవే, ఈవలెన్=ఇయ్య వలెను. తక్కినమాటలు=ఇతరమైన పలుకులు, ఏమిటికి=ఏమిలాభము? దాశ రథీ.........కరుణాపయోనిధీ!

తా. రామభద్రా! అజ్ఞానులైన కొందఱు మనుష్యులు పంచదారను విడిచి చేదువస్తువులను దినునట్లు నిన్ను విడిచి శక్తిలేని యితరదైవములను గొల్తురు. అది మంచిదికాదు. నమస్కరించిన నీకే నమస్కరింపవలెను. మోక్ష మిచ్చిన నీవే యియ్యవలెను గాని తక్కినవారి కెన్ని దండములు పెట్టినను ఫలము శూన్యము.

ఉ. 'రా'కలుషంబులెల్లబయలం ♦ బడద్రోచిన'మా'కవాటమై
డీకొనిప్రోచు నిక్కమని♦ధీయుతులెన్నఁ దదీయవర్ణముల్

గై కొని భక్తి చేనుడువఁ ♦ గానరుగాక విపత్పరంపరల్
దాఁకొనునే జగజ్జనుల ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 22

టీ. రా=రామశబ్దములోని మొదటియక్షరమగు 'రా' అనునది, కలుషంబులు + ఎల్లన్=పాపముల నన్నింటిని, బయలన్=వెలుపలకు, పడఁద్రోచినన్=త్రోసివేయఁగా, మా=రెండవ అక్షరమైన 'మా' అనునది, కవాటమై=తలుపై, డీకొని=అడ్డుకొని, ప్రోచున్=రక్షించును, నిక్కమని=నిజమని, ధీయుతులు=బుద్ధిమంతులు, ఎన్నన్=చెప్పుచుండ, తదీయవర్ణముల్=ఆ 'రామా' అను రెండక్కరములను, గైకొని=గ్రహించి, భక్తిచేన్=భక్తితో, నుడువన్=పలుకుటను, కానరుగాక=తెలిసికొనలేరుగాని, జగజ్జనులకా=లోకమందలి మనుజులను, విపత్పరంపరల్=కష్టములగుంపులు, దాఁకొనునే=దరిచేరగలవా? (దరిచేరలేవు.)

తా. రామ శబ్దములోని 'రా' అను మొదటి యక్షరము పలికిన పాపములన్నియు వెలుపలికి వచ్చును. 'మా' అను రెండవయక్షరము నుచ్చరించిన
అది వెలికివచ్చిన పాపములను లోపలికి తిరిగిపోకుండ తలుపువలె నడ్డుపడును.
అని జ్ఞానులు చెప్పుచుండఁగా నారామశబ్దమును లోకులు పలుకుట తెలియలేరుగాని వాని నుచ్చరించినవారిని కష్టములేవియు దరిజేరలేవు.

ఉ. రామహరే కకుత్స్థకుల♦రామహరే రఘురామరామ శ్రీ
రామహరే యటంచు మది♦రంజిల భేకగళంబులీల నీ
నామము సంస్మరించిన జ♦నంబు భవం బెడబాసి తత్పరం
ధామనివాసులౌదురఁట ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 23

టీ. రామహరే, కకుత్స్థకుల రామహరే, రఘురామ, రామ, శ్రీరామ, హరే, అటంచు=అనునీవిధముగ, మది=మనసులో, రంజిలన్=ఆనందింపగా, భేకగళంబులీలన్=కప్పయొక్క కంఠధ్వనివలె, నీనామమున్=నీపేరును, సంస్మరించిన=ధ్యానించిన, జనంబు=జనులు, భవంబు=పుట్టుకను, ఎడఁబాసి=విడిచి, తత్=ఆ, పరంధామ=వైకుంఠమున, నివాసులు=నివసించువారు, ఔదురట=అగుదురట, దాశరథీ.........నిధీ.

తా. రామ, శ్రీరామ, హరే, రామహరే, కకుత్థ్సకులరామహరే యనెడి నీ పేళ్ళను సర్వదా కప్పు మరువక కూయునట్లు ధ్యానించెడి మనుజులు జన్మరహితులై పరతత్వపదంబను వైకుంఠమును జేరుదురు.

ఉ. దారుణపాతకాబ్ధికి స ♦ దాబడబాగ్ని భవాకులార్తి వి
స్తారదవానలార్చికి సు ♦ ధారసవృష్టి దురంత దుర్మతా
చార భయంకరాటవికిఁ ♦ జండకఠోరకుఠారధార నీ
తారకనామ మెన్నుకొన దాశరథీ కరుణాపయోనిధీ! 24

టీ. దాశరథీ=శ్రీరామచంద్రా! నీ తారకనామము = సంసారమును తరింపఁజేయు నీ పేరును, ఎన్నుకొనన్=ధ్యానింపఁగా, దారుణ=కష్టమైన, పాతక=పాపములను, అబ్ధికిన్=సముద్రమునకు, సదా=ఎల్లప్పుడు, బడబాగ్ని=బడబాగ్నియైనది; భవ = సంసారముయొక్క, ఆకుల = వ్యాకులమగు, ఆర్తి విస్తార=విరివియైన వ్యసనమను, దవానలార్చికి=గొప్పమంటకు, సుధారసవృష్టి=అమృతము యొక్క వర్షము; దురంత=హద్దులేని, దుర్మతాచార=చెడ్డ మతాచారములనెడి, భయంకర=భీతిని బుట్టించు, అటవికిన్=అరణ్యమునకు, జండ=తీక్ష్ణమైన, కఠోర=బిరుసైన, కుఠారధార=గొడ్డలియంచువంటిది.

తా. శ్రీరామచంద్రా! నీపేరుచ్చరించిన సంసారసముద్రమును దాటించును. పాపసముద్రమును బడబానలము రీతి నింకజేయును. దుఃఖమను గొప్పమంటకు అమృతవర్షమై చల్లార్చును. దుర్మతారణ్యములను గండ్రగొడ్డలి వలె ఛేదించును.

చ. హరునకు నవ్విభీషణున ♦ కద్రిజకుం దిరుమంత్రరాజమై
కరికి నహల్యకున్ ద్రుపద♦కన్యకు నార్తిహరించుచుట్టమై
పరఁగిన యట్టి నీపతిత ♦ పావననామము జిహ్వపై నిరం
తరము నటింపఁజేయుమికఁ ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 25

టీ. హరునకున్=ఈశ్వరునకు, అవ్విభీషణునకు = రావణుని సోదరుండగు విభీషణునకు, అద్రిజకున్=పార్వతీదేవికిని, తిరుమంత్రరాజమై=మేలైన

గూర్చుమంత్రమై, కరికిన్ = ఏనుఁగునకు, అహల్యకున్ = గౌతమునిభార్యకు, ద్రుపదకన్యకున్=ద్రౌపదికిని, ఆర్తి=కష్టము, హరించు=పోగొట్టు, చుట్టమై= బంధువై, పరఁగిన=ప్రసిద్ధినందిన, అట్టినీపతితపావననామము=అట్టినీయొక్క పవిత్రమైనపేరు, ఇఁకన్=ముందునుండి, నిరంతరము=ఎల్లపుడు, జిహ్వపైన్= నానాలుకపై, నటింపఁజేయుము=నాట్యమాడింపుము

తా. శ్రీరామా! పార్వతీపరమేశ్వరులు, విభీషణుఁడు మున్నగువారు నిత్యము ధ్యానించు మంత్రమై, నటరాజు, అహల్య, ద్రౌపదీదేవి మొదలగువారి కష్టములను దొలగించు బంధువై, పవిత్రమై ప్రసిద్ధినొందిన నీపేరికముందు సర్వదా నానాలుకయందు నాట్యమాడునట్లు చేయుము.

ఉ. ముప్పునఁగాలకింకరులు ♦ ముంగిటవచ్చినవేళ రోగముల్
గొప్పరమైనచోఁ గఫము ♦ కుత్తుక నిండినవేళ బాంధవుల్
గప్పినవేళ మీస్మరణ ♦ గల్గునొ గల్గదొ నాటి కిప్పుడే
తప్పక చేతు మీభజన♦దాశరథీ కరుణాపయోనిధీ! 26

టీ. ముప్పునన్=ముసలితనమున, కాలకింకరులు=యమభటులు, ముంగిటన్=దగ్గఱకు, వచ్చినవేళన్=వచ్చినప్పుడు, రోగముల్=వ్యాధులు, కొప్పరమైనచోన్=ఎక్కువకాగా, కఫము=శ్లేష్మము, కుత్తుక=కంఠము, నిండినవేళన్=పూర్తియైనపుడు, మీస్మరణ=మీధ్యానము, కల్గునొ కల్గదొ=నాకు కలుగునో కలుగదో, నాటికిన్ = అప్పటికి బదులుగ, ఇప్పుడే = ఈనాడే, మీభజన=మీధ్యానము, తప్పక=విడువక, చేతున్=చేతును.

తా. రామభద్రా! ముసలితనమున రోగము లెక్కువై శ్లేష్మము కంఠమును ముట్టడించి బాధపడువేళ బంధువులందఱు నాచుట్టు మూగియుండ యమదూతలు బంధించుకొని పోవుటకు సమీపింప నప్పుడిక మీనామస్మరణ చేయగలుగుదునో చేయలేనో! అందుచే నిప్పటినుండియే సదా మీనామమును స్మరించుచుండెదను.

చ. పరమదయానిధే పతిత ♦ పావననామ హరేయటంచు సు
స్థిరమతులై సదా భజన ♦ సేయు మహాత్ములపాదధూళినా

శిరమున దాల్తుమీ రటకు♦జేరకుడంచు యముండు కింకరో
త్కరముల కానఁబెట్టునట ♦ దాశరథీకరుణాపయోనిధీ! 27

టీ. పరమదయానిధే=గొప్పదయకు పెన్నిధివంటివాఁడా!, పతితపావన నామ=పాపులను పవిత్రముఁ జేయుపేరు కలవాఁడా!, హరే=పాపములను హరించువాఁడా!, అటంచు=అనుచు, సుస్థిరమతులై,=స్థిరబుద్ధికలవారై, సదా=ఎల్లపుడు, భజన సేయు=మిమ్ము ధ్యానించు, మహాత్ముల పాదధూళి=గొప్పవారి కాలిదుమ్మును, నా శిరమునన్ = నా తలయందు, దాల్తున్ = ధరింతును. యముఁడు=యమధర్మరాజు, కింకరోత్కరములకు=తన భటులకు, మీరు = మీరలు, అటకున్ = మీభక్తుల పాదధూళి శిరసున ధరించువారికడకు, చేరకుఁడు=పోకుఁడు, అంచున్=అని, ఆనన్=ఆజ్ఞను, పెట్టునట = చేయునట! దాశరథీ.........నిధీ.

తా. "ఓరామచంద్రా! నీవు దయాసముద్రుడవు; పాపములను హరించు పేరుకలవాఁడవు. మమ్ము రక్షింపు" మని స్థిరచిత్తముతో నిన్ను గొల్చు నామహాత్ముల పాదధూళిని శిరసున ధరింతును. అట్టివారికడకు యముఁడు తన సేవకులను బోవలదని యాజ్ఞాపించునట

ఉ. చక్కెరలప్పుకున్ మిగుల ♦ జవ్వనికెంజిగురాకుమోవికిం
జొక్కపుజుంటితేనియకు♦జొక్కులుచుం గనలేరు గాక నేఁ
డక్కట రామనామమధు♦రామృతమానుటకంటె సౌఖ్యమా
తక్కినమాధురీమహిమ ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 28

టీ. చక్కెరలప్పుకున్ = పంచదారతోఁ జేసిన యప్పచ్చులకును; మిగుల=మిక్కిలి, జవ్వనికెంజిగురాకు = పడుచుదానికెంపువలె చిగురువంటి, మోవికిన్=పెదవికిని; చొక్కపుజుంటితేనియకున్=స్వచ్ఛమగు తుమ్మెదలు తెచ్చిన తేనెకును, చొక్కులుచున్=ఆనందింపుచు, కనలేరుగాక=తెలియలేరుగాని, నేఁడు=ఈరోజు, అక్కట = అయ్యో!, రామనామ=రాముని పేరనెడు, మధుర=తియ్యనైన, అమృతము, ఆనుటకంటెన్ = రుచిచూచు

కంటె, తక్కిన=మిగిలిన, మాధురీసుహిమ=తీపిచల్లదనము, సౌఖ్యము=సుఖ
మిచ్చునదియా? (కాదు).

తా. మనుజులు పంచదారతో జేసిన యప్పచ్చులు మొదలగు భక్ష్య
ములను, నడివయసులోనున్న యాడుదాని క్రిందిపెదవిని, మంచి తేనెను
ఆశించి పాకులాడుచు రామనామామృత మిట్టిరుచి కలదని యోజింపజాలరు
కాని నామామృతపు రుచిచూచిన సౌఖ్యమున కితరతిన్యాదనము లేవియు
సాటిరావు.

ఉ. అండజవాహ నిన్ను హృద*యంబున నమ్మినవారిపాపముల్
కొండలవంటివైన వెస*గూలి నశింపక యున్నె సంతతా
ఖండలవైభవోన్నతులు*గల్గక మానునె మోక్షలక్ష్మికై
దండ యొసంగకున్నె తుద*దాశరథీ కరుణాపయోనిధీ! 29

టీ. అండజవాహ=గరుడుఁడు వాహనముగా గలవాఁడా!, నిన్ను, హృద
యంబున=మనసునందు, నమ్మినవారి పాపముల్=నమ్మికొన్నవారి పాప
ములు, కొండలవంటివైనన్=ఎంత పెద్దవైనను, వెసన్=తొందరగా, కూలి=
పడి,నశింపకయున్నె=నాశమందవా? సంతత=ఎడతెగని, ఆఖండల=ఇంద్రుని
యొక్క, వైభవోన్నతులు=గొప్పయైశ్వర్యములు, కల్గకమానునె=కల్గకపోవు,
తుదన్=చివర, మోక్షలక్ష్మి=ముక్తియనుభాగ్యము, కైదండ=చేయూత,
ఒసంగకున్నె=ఇయ్యకుండగ నుండదు.

తా. ఓ గరుడవాహనా! నిన్ను నమ్మి కొల్చువారిపాపము లెంత పెద్ద
వైనను నశింపక మానవు. వారి కెడతెగని యింద్రభోగంబులు కలిగి తీరును,
చివర మోక్షముకూడ సులభముగా సిద్ధించును.

ఉ. చిక్కనిపాలపై మిసిమిఁ*జెందినమీఁగడ పంచదారతో
మెక్కినభంగి నీవిమల*మేచకరూప సుధారసంబు నా
మక్కువపళ్ళెరంబున స*మాహితదాస్యమనేటి దోయిటన్
దక్కఁగఁటంచు జుఱ్ఱెదను * దాశరథీ కరుణాపయోనిధీ! 30

టీ. చిక్కనిపాలపై = చిక్కనగు పాలమీద, మిసిమిన్ = కాంతిని, చెందినమీఁగడ=పొందిన మీఁగడను, పంచదారతో=చక్కెరతో; మెసవినభంగిన్=తినినరీతిగా, నీ=నీదైన, విమల=స్వచ్ఛమగు, మేచకరూప=నల్లనిరూపమను, సుధారసంబుకా = అమృతరసమును, నా మక్కువపళ్ళెరంబునన్ = నాయాశయనెడిపాత్రలో, సమాహిత=బాగుగానుంచఁబడిన, దాస్యమనేటి= సేవించుటయను, దోయిటన్=దోసిలియందు, దక్కెనటంచున్ = దొరకినదని, జుఱ్ఱెదను=త్రాగెదను.

తా. శ్రీరామచంద్రా! చిక్కని పాలమీద మిసమిసలాడు వెన్నతో గలిసిన మీగడ పంచదారతోఁ గలిపి త్రావినట్లు నీస్వచ్ఛమైన నల్లని రూపమనెడి యమృతరసమును నాయనురాగమనెడు పాత్రలో నుంచుకొని సేవకత్వమనెడి దోసిలితో జుఱ్ఱుచున్నాను.

చ. సిరులిడసీతపీడలెగ ♦ జిమ్ముటకున్ హనుమంతుఁ డార్తిసో
దరుఁడు సుమిత్రిసూతిదురి♦తంబులమానుపరామనామమున్
గరుణదలిర్ప మానవులఁ ♦ గావఁగఁబన్నిన వజ్రపంజరో
త్కరముగదా భవన్మహిమ ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. సిరులు = సంపదలు, ఇడన్ = ఇచ్చుటకు, సీత=సీతాదేవియు; పీడలు=బాధలు, ఎగఁజిమ్ముటకున్=పోగొట్టుటకు, హనుమంతుఁడు = ఆంజనేయుఁడును; ఆర్తి=కష్టములను బోగొట్టుటకు, సోదరుఁడు=నీతమ్ముఁడైన, సుమిత్రిసూతి=లక్ష్మణుఁడును, దురితంబులన్=పాపములను, మానుపన్=నశింపజేయుటకు, రామనామమున్=రామ అను పేరును, కరుణదలిర్పన్=ఎక్కువ ప్రేమతో, మానవులన్=మనుష్యులను, కావఁగన్=రక్షించుటకు, పన్నిన = కూర్చిన, భవన్మహిమ = నీగొప్పదనము, వజ్రపంజరోత్కరముగదా = వజ్రములతోఁ జేయఁబడిన పంజరపు గూళ్ళవంటిదిగదా!

తా. మనుష్యులకు సంపద లొసంగ సీతయు, బాధలుపోగొట్ట హనుమంతుఁడును, కష్టము వచ్చిన నాదుకొన లక్ష్మణుఁడును, పాపములను

పోద్దాల నీనామంబును మానవులనెడి చిలుకలకు మృత్యువనెడి పిల్లివలన భయము లేకుండుటకై నీమహిమ యనెడి వజ్రముతోఁ జేయబడిన పంజరము కదా!

చ. హలకులిశాంకుశధ్వజ ♦ శరాసన శంఖ రథాంగ కల్పకో
జ్జ్వలజలజాత రేఖలను ♦ సాంకములై కనుపట్టుచున్న మీ
కలితపదాంబుజద్వయము ♦ గౌతమపత్ని కొసంగినట్లు నా
తలఁపునఁ జేర్చి కావఁగదె ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 31

టీ. హల=నాగలి, కులిశ=వజ్రాయుధము, అంకుశ=అంకుశము, ధ్వజ=టెక్కెము, శరాసన=ధనువు, శంఖ=శంఖము, రథాంగ=చక్రము, కల్పక=కల్పవృక్షము, ఉజ్జ్వల=ప్రకాశించు; జలజాతరేఖలను = పద్మరేఖలచేతను, సాంకములై=చిహ్నితములై, కనుపట్టుచున్న=కాన్పించెడి, మీకలితపదాంబుజద్వయము=ఒప్పిదమగు మీపాదపద్మములజంట, గౌతమపత్నికి=అహల్యకు, ఒసంగినట్లున్=ఇచ్చినటుల, నాతలఁపునన్=నాహృదయమున, చేర్చి=సమకూర్చి, కావఁగదె=కాపాడుమా!

తా. శ్రీరామచంద్రా! తొల్లి భర్తచే శపింపఁబడి శిలయై పడియున్న యహల్యపై నాగలి వజ్రాయుధము అంకుశము ధనువు శంఖచక్రములు కల్పవృక్షము మొదలగువానితో తామరరేకులను బోలి ప్రకాశించు మీపాదముల మోపి నిజరూప మొసంగితివి. ఆపాదము లెల్లవేళల నామనసున నుండునట్లనుగ్రహించి నన్ను ధన్యుని జేయుము.

చ. జలనిధిలోన దూఁటి కుల ♦ శైలముమీటి ధరిత్రిఁగొమ్మునం
దలవడ మాటి రక్కసుని ♦ యంగముగీటి బలీంద్రునిన్ రసా
తలమున మాటి పార్థివక ♦ దంబముఁ గూల్చిన మేటిరామ నా
తలఁపున నాటి రాఁగదవె ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 33

టీ. జలనిధిలోనన్ = సముద్రమందు, దూఁటి=చొఱబడి, కులశైలమున్=కులపర్వతమును, మీటి = పెకలించి, కొమ్మునందు = కొమ్మున,

ధాత్రిన్=భూమిని, అలవడన్=అభ్యాసపడురీతి, మాటి=తగిలించి, రక్కసుని యంగము=హిరణ్యాక్షునిశరీరము, గీటి=చీల్చి, బలీంద్రునిన్=బలిచక్రవర్తిని, రసాతలమునన్=పాతాళమున, మాటి=మఱుగుపడజేసి, పార్థివకదంబమున్=రాజసమూహమును, కూల్చిన=చంపిన, మేటి=గొప్పవాఁడవగు, రామ=శ్రీరామా; నాతలఁపునన్ = నాహృదయమునందు, నాటి = వసించి, రాఁగదవె=రమ్మా!

తా. వేదములను దొంగిలించి సముద్రమున దాగిన సోమకాసురుని మత్స్యావతారమెత్తి జంపి యావేదమును తిరిగి బ్రహ్మ కిచ్చితివి. మందర పర్వతముతో దేవరాక్షసులు సముద్రము నమృతమునకై మథించుచుండ నా పర్వతము లోనికి గ్రుంగ కూర్మావతారమెత్తి వీపున మోసితివి. భూమిని చాపవలె చుట్టికొనిపోవు హిరణ్యాక్షుని వరాహరూపమును దాల్చి చంపి నీటమునిగిన భూమిని పంటిచే పైకెత్తి నిలిపితివి. ఇంద్రునకు స్వర్గము నిలువ వామనావతారమెత్తి బలిచక్రవర్తిని మూడడుగులతావు వేడి పాతాళమున నడగద్రొక్కితివి. పరశురామావతారుడవై యిరువదియొక్కమారు రాజు లందఱును రూపుమాపితివి. ఇంతటి గొప్పవాడవగు రామా! నాహృదయమున సదా వసింపుము.

ఉ. భండనభీముఁ డార్తజన ♦ బాంధవుఁ డుజ్జ్వలబాణతూణ కో
దండకళాప్రచండభుజ ♦ తాండవకీర్తికి రామమూర్తికిన్
రెండవసాటిదైవ మిఁక ♦ లే దనుచుం గడఁగట్టి భేరికా
దండము నెక్కి చాటెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 34

టీ. భండనభీముఁడు=యుద్ధమున భయంకరరూపుడు, ఆర్తజనబాంధవుఁడు=కష్టములొందినవారికిఁ జుట్టమువంటివాఁడు, ఉజ్జ్వల=ప్రకాశించెడి, బాణ=బాణములు, తూణీర=అంబులపొదియుఁగల, కోదండకళా=ధనుర్విద్యయందు, ప్రచండ=వాడిగల, భుజ=భుజమందు, తాండవ=నటించు, కీర్తికిన్=కీర్తివంతుఁడగు, రామమూర్తికిన్ = శ్రీరామచంద్రునకు, రెండవసాటిదైవము=వేరొకసమానదేవుఁడు, ఇఁకన్ = ఈమీఁద, లేదనుచున్=లేదని,

గడఁగట్టి=ధ్వజ స్తంభముపాతి, భేరికా=భేరియొక్క, డాండడడాండ డాం డనినదంబులు=ధ్వనివిశేషములు, అజాండము = బ్రహ్మనిర్మితభూమండలము, నిండన్=నిండునట్లు, మత్తవేదండమున్ = మదపుటేనుఁగును, ఎక్కి=చాటెదను=అందఱకుఁ దెలియఁబఱతును.

తా. యుద్ధమున శత్రుభీకరుఁడై బాధలొందుమనుజుల రక్షించుబంధువై మిగులఁబ్రకాశించు ధనుర్బాణములతో విలువిద్యానిపుణుడగుట భుజములందు నాట్యమాడు యశోవంతుఁడైన రామచంద్రునకు సమానదేవుఁ డీభూమిలో లేడని బ్రహ్మ సృష్టించినభూమండలమంతయు ధ్వజముపాతి భేరివేయించి యేనుఁగునెక్కి చాటుదును.

చ. అవనిజకన్నుదోయి తొగ ♦ లందు వెలింగెడుసోమ జానకీ
కువలయనేత్రిగబ్బిచను ♦ గొండల నుండు ఘనంబ మైథిలీ
నవనవయావనంబను వ ♦ నంబునకున్ మదదంతి వీవె శా
దవిలి భజింతు నెల్లపుడు ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 35

టీ. అవనిజ = సీతాదేవియొక్క, కన్నుదోయి = రెండుకన్నులనెడి, తొగలందు=కలువపూవులందు, వెలింగెడు=ప్రకాశించు, సోమ=చంద్రునివంటివాఁడా! జానకీ=సీతయనెడి, కువలయనేత్రి=నాయికయొక్క, గబ్బిచనుగొండలన్=కొండలవంటి చన్నులందు, ఉండు=వసించు, ఘనంబ=మేఘునివంటివాఁడా! మైథిలీ=సీతయొక్క, నవనవ=మిగులక్రొత్తదైన, యావనంబను=పడుచుదనమనెడి, వనంబునకున్ = ఉద్యానవనమునకు, మదదంతివి=మదపుటేనుఁగవు, ఈవెకా=నీవేకదా!, తవిలి=ప్రియత్నించి, ఎల్లపుడు=ఎపుడును, భజింతున్=సేవింతును.

తా. శ్రీరామా! సీతాదేవికన్నులజంటయను కలువలందు వెలుంగు చంద్రుఁడవును, సీతాదేవి కుచంబులనెడి కొండలయందుండు మేఘుఁడవును, సీతాదేవిక్రొత్తపడుచుదనంబనెడి యుద్యానమున విహరించు మదపుటేనుంగువు నీవేయని నిన్నే యెల్లపుడు విడువక కొల్తును.

చ. ఖరకరవంశజా వినుమ ♦ ఖండిత భూత పిశాచ ఢాకినీ
జ్వరపరితాప సర్పభయ ♦ వారకమైన భవత్పదాబ్జ వి
స్ఫురదురువజ్రపంజరముఁ ♦ జొచ్చితి నీయెడ దీనమానవో
ద్ధరబిరుదాంక మేమఱకు ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 36

టీ. ఖరకరవంశజా = వేడికిరణంబులుకల సూర్యవంశమునఁ బుట్టినవాఁడా!, వినుమ=ఆలింపుము, అఖండిత=నఱుకబడని, భూత=భూతములు, పిశాచ=పిశాచములు, ఢాకినీ = ఢాకినీయనుగ్రహములు, జ్వర=జ్వరములు, పరితాప=సంకటములు, సర్పభయ = పాములవలనభయమును, వారకమైన= నివారించు, భవత్=నీయొక్క, పదాబ్జ=పాదకమలంబులనెడి, విస్ఫురత్= మిగులకాంతించు, ఉరు = గొప్పదైన, వజ్రపంజరమున్ = వజ్రపుగూటిని, చొచ్చితిన్=ప్రవేశించితిని, ఈయెడన్=ఈసమయమున, దీనమానవ=దిక్కులేని మనుష్యులను, ఉద్ధర = కాపాడు, బిరుదాంకము = బిరుదుచిహ్నమును, ఏమఱకు=మఱువకుము.

తా. సూర్యవంశమునఁ బుట్టిన రామచంద్రా! వినుము. వారింపజాలని భూతపిశాచ ఢాకినీజ్వరపరితాపములు, పాములవలని భయములను నివారింపగల నీపాదపద్మంబను వజ్రపుగూటిని నేను ప్రవేశించితిని. ఇపుడు నీవు దిక్కులేనివారిని గాపాడుదువన్న బిరుదునుమాత్రము మఱచిపోక నన్ను రక్షింపుము.

ఉ. జుట్టెదమీకథామృతము ♦ జుట్టెదమీపదకంజతోయముల్
జుట్టెద రామనామమున ♦ జొబ్బిలుచున్న సుధారసంబు నే
జుట్టెద జుట్టజుట్టగరు ♦ చుల్ గనువారి పదంబు గూర్పవే
తట్టుబతోడ పొత్తిడక ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 37

టీ. మీకథామృతమ=మీకథలనెడి యమృతమును, జుట్టెన=త్రాగుదును, మీపదకంజతోయమున్=పద్మమువంటి మీపాదోదకమును, జుట్టెద= త్రాగుదును, రామనామమునన్ = రామఅనుపేరునందు, జొబ్బిలుచున్న=

కారెడి, సుధారసంబు గేన్=అమృతధారగే, జుర్రెద=త్రావుదును, జుర్రుజుర్రు గన్ = త్రావగాత్రావగా, తజ్జులతోడిపొత్తు = తక్కువవారితో పాటి, ఇడక=ఇవ్వక, రుచుల్=రుచులు, కనువారి=తెలియువారి, పదంబు=స్థానము, కూర్పవే=ఇమ్మా!

తా. శ్రీరామచంద్రా! నేను నీకథలయందలి యమృతమును, నీపాద తీర్థమును, నీపేరునందూరుసుధను త్రావెదను. అందుచే నాకు నీచులతో పొత్తు కుదుర్పక నీపాదధ్యాన మొనరించుచు నీనామమందలి రుచిని దెలిసి కున్న మహాత్ములతో సహవాసము కలుగజేయుము.

ఉ. ఘోరకృతాంతవీరభట ♦ కోటికి గుండెదిగుల్ దరిద్రతా
  కారపిశాచసంహరణ ♦ కార్యవినోది వికుంఠమందిర
  ద్వారకవాటభేది నిజ ♦ దాసజనావళి కెల్లప్రొద్దు నీ
  తారకనామ మెన్నికొన ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 88

టీ. నీతారకనామము= సంసారసాగరమును దాటించు నీపేరు, ఎల్ల ప్రొద్దు=నిరంతరము, ఎన్నికొనన్=ధ్యానించిన, ఘోర=భయంకరములగు, కృతాంత=యమునియొక్క, వీరభటకోటికి = వీరులైనభటసమూహమునకు, గుండెదిగుల్=గుండెదడను గలిగించునది, దరిద్రతాకార=పేదతనమను రూప ముగల, పిశాచ = దయ్యమును, సంహరణకార్య = రూపుమాపుపనియందు, వినోది=వేడుకైనది, నిజదాసజనావళికి=నీభక్తబృందమునకు, వికుంఠమందిర= వైకుంఠమను నింటియొక్క, ద్వారకవాట=గడపతలుపును, భేది=తెరచునది.

తా. శ్రీరామా! నీనామధ్యానము యమభటులగుండెలలో దడ పుట్టించును. దరిద్రపిశాచమును దగ్ధము చేయును. వైకుంఠద్వారమును దెరచి నీభక్తులకు ముక్తి నిచ్చును.

ఉ. విన్నప మాలకింపు రఘు ♦ వీరసహి ప్రతిలోకమందు నా
  కన్నదురాత్ముఁడుం బరమ ♦ కారుణికోత్తమవేల్పులందునీ

కన్న మహాత్ముఁడుం బతిత ♦ కల్మషదూరుఁడు లేఁడుగానవి
ద్వన్నుత నీవె నాకు గతి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 39

టీ. రఘువీర=రఘువంశపువీరుఁడా! విన్నపము=విజ్ఞప్తి, ఆలకింపుము=వినుము, ప్రతిలోకమందు=ఒక్కొక్క లోకమునందు, నాకన్నన్=నాకంటె, దురాత్ముడు=దుర్మార్గుఁడు, నహి=లేఁడు, పరమకారుణికోత్తమ=మిగుల దయగలవాఁడా!, వేల్పులందు=దేవతలందు, నీకన్నన్=నీకంటె, మహాత్ముఁడున్ = గొప్పవాఁడును, పతితకల్మషదూరుఁడు = పాపులపాపములఁబాపువాఁడు, లేఁడుగాన=లేనందున, విద్వన్నుత=జ్ఞానులచేఁ బొగడఁబడువాఁడా! నీవె=నీవే, నాకు, గతి=దిక్కు.

తా. భక్తులను దయతోఁబోషించు రఘువంశవీరుఁడవైన రామచంద్రా! నామనవిని వినుము. ప్రతిలోకమందలి మనుజులలోను నాకంటె చెడ్డవాఁడును, దేవతలలో నీకన్న గొప్పవాఁడును, పాపులపాపముల పోగొట్టువాఁడును లేడుకావున నన్ను నీవే కాపాడవలయును.

ఉ. పెంపను దల్లివై కలుష ♦ బృందసమాగమ మొందకుండర
క్షింపను దండ్రివై మెయివ ♦ సించుద శేంద్రియరోగముల్ నివా
రింపను వెజ్జవై కృపగు ♦ ఱించి పరంబు దిరంబు గాఁగ స
త్సంపద లియ్య నీవె గతి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 40

టీ. పెంపను=పెంచుటకు, తల్లివై = తల్లివంటివాఁడవై, కలుషబృందసమాగమము=పాపములతోఁ గలియికను, ఒందకుండన్ = పొందకుండగా, రక్షింపన్=కాపాడుటకు, తండ్రివై=తండ్రివంటివాఁడవై, మెయివసించు=దేహమందుండు, దశేంద్రియరోగముల్=పదియింద్రియములవ్యాధులను, నివారింపను=పోగొట్టుటకు, వెజ్జవై=వైద్యుఁడవై, కృపగుఱించి=దయయుంచి, పరంబు=ముక్తి, తిరంబుగాఁగ=స్థిరముగునట్లు, సత్సంపదలు = మంచిభాగ్యములు, ఇయ్యన్=ఇచ్చుటకు, నీవెగతి=నీవేదిక్కు!

తా. రామచంద్రా! తల్లివలె పోషింపను, తండ్రివలెఁ గాపాడను; వైద్యునివలె శరీరరోగములను నివారింపను, స్థిరమగుమోక్షసంపదలనొసంగను నాకు నీవే దిక్కని నమ్మియుంటిని.

ఉ. కుక్షి నజాండపఙ్క్తులొన • గూర్చిచరాచరజంతుకోటి సం
రక్షణసేయు తండ్రివి ప • రంపర నీతనయుండ నైన నా
పక్షము నీవు గావలదె • పాపము లెన్ని యొనర్చినన్ జగ
ద్రక్షక కర్త వీవె కద • దాశరథీ కరుణాపయోనిధీ. 41

టీ. కుక్షిన్=కడుపునందు, అజాండపంక్తులు = బ్రహ్మాండసమూహములు, ఒనగూర్చి=పొందుపఱచి, చరాచరజంతుకోటి=తిరుగునవి తిరుగనవి నైన ప్రాణిసమూహమును, సంరక్షణసేయు=కాపాడు, తండ్రివి, పాపములు, ఎన్నియొనర్చినన్=ఎన్ని చేసినను, పరంపరన్=వరుసగా, నీతనయుండనైన= నీకుమారుఁడనగు, నాపక్షము=నాపక్కనుండువాఁడవు, నీవు, కావలదె= నీవగుము. జగద్రక్షకకర్తవు = జగములరక్షించునధికారివి, ఈవెకదా = నీవేగదా?

తా. రామచంద్రా! సమస్తబ్రహ్మాండములను కడుపులో నుంచుకొని ప్రాణికోటిని రక్షించునీవు నేనెన్నితప్పు లొనర్చినను నాపక్షముననేయుండి నన్గాపాడవలయును. నేను తరతరములనుండి నీకొడుకును. తండ్రి కొడుకు తప్పులను మన్నించి తీరవలెను. నీవు జగద్రక్షకుడవగుట నన్నేగాక యందఱను గాపాడవలసియుంటివిగదా!

ఉ. గద్దఱియోగిహృత్కమల • గంధరసానుభవంబుజెందు పె
న్నిద్దవుగండుతేఁటి ధర • ణీసుతకౌఁగిలిపంజరంబునన్
ముద్దులుగుల్కురాచిలుక • ముక్తినిధానమ రామరాఁగదే
తద్దయునేఁడు నాకడకు • దాశరథీ కరుణాపయోనిధీ. 42

టీ. గద్దఱి=పెద్దలగు, యోగి=యోగుల, హృత్కమల = హృదయపద్మమునందలి, గంధరసానుభవంబు = వాసనగలమకరందము ననుభవించుటను;

చెందు=పొందెడి, పెన్నిద్దపుగండు తేటి=మిక్కిలికాంతిగల గండుతుమ్మెద వంటివాఁడా, ధరణీసుతకౌఁగిలి=సీతాదేవియాలింగనమునెడి, పంజరంబునన్=గూటియందు, ముద్దులుగుల్కు = ముద్దుగాబలుకు, రాచిలుక = చిలుకవంటి వాడా!, ముక్తినిధానమ = మోక్షమునకు వాసమైనవాఁడా!, రామ = రాముఁడా!, నేడు=ఈదినము, తద్దయు=ఇంకను, నాకడకు=నాదగ్గఱకు, రాగదే=రమ్ము.

తా. మహాయోగుల హృదయపద్మమందలి పరిమళముతోనొప్పు భక్తిరసము ద్రావుగండుతుమ్మెదవు, సీతాదేవికౌగిలియనుపంజరమునముద్దులుగుల్కు రామచిలుకవు; మోక్షవాసుఁడవునైన రామా! ఈరోజు నీవు నావద్దకురమ్ము.

చ. కలియుగమర్త్యకోటి నినుఁ ♦ గన్గొనరానివిధంబొ భక్తవ
త్సలత వహింపవో చటుల ♦ సాంద్రవిపద్దశ వార్ధిఁ గ్రుంకుచోఁ
బిలిచినఁ బల్కవింతమఱ ♦ పే నరు లిట్లనరాదు గాక నీ
తలఁపున లేదె సీతచెఱ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 43

టీ. కలియుగమర్త్యకోటి = ప్రపంచమందలి మనుష్యసమూహము, నినున్=నిన్ను, కన్గొనరానివిధంబొ=తెలిసికొనరానివిధమో, భక్తవత్సలత=భక్తులందు వాత్సల్యమును, వహింపవో=పూనవో, చటుల=మిగుల, సాంద్ర=దట్టమగు, విపద్దశ=ఆపత్కాలమను, వార్ధిన్=సంద్రమున, క్రుంకుచోన్=మునుఁగునపుడు, పిలిచినన్=పిలిచినను, పల్కవు=మాటాడవు, ఇంతమఱపే=ఇంతమఱుపా? నరులు=మనుష్యులు, ఇట్లనరాదుగాక=ఈరీతిగ ననగూడదు గాని, నీతలఁపునన్=నీమనసున, సీతచెఱ=సీతాదేవి రావణునిచేఁ బొందిన యవస్థ, లేదే=లేదా?

తా. రామచంద్రా! నేను మిగుల నాపదనొంది పిలిచినను పలుకక పోవుట జూడ కలియుగమునందలి మనుష్యులు నిన్నుజూడ దగనివారని తలంచితివా? ఒకవేళ నాదీనధ్వని మఱచితివా? భక్తవత్సలుండవగు నీకు మఱపన్నది సహింపను. ఏలనన నాడు సీతాదేవి రావణునిచే చెఱఁబెట్టబడుట మఱువలేదు. అట్లే మమ్ముగూడ మఱచి యుండవు.

చ. జనవర మీకథాళి విన ♦ సైపక కర్ణములందు ఘంటికా
నినదవినోదముల్ సలుపు ♦ నీచునకున్ వర మిచ్చినావె ని
న్ననయమునమ్మి కొల్చినమ ♦ హాత్ములకేమియొసంగెదో సనం
దననుతమాకొసంగుమయ ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 44

టీ. జనవర=మనుజులలో శ్రేష్ఠుండవైన రామా! మీకథాళి=మీకథలను, వినన్=వినుటకు, సైపక=సహింపక, కర్ణములందు=చెవులలో, ఘంటికానినద=ఘంటలధ్వనుల, వినోదముల్=వేడుకలు, సలుపు=కావించు, నీచునకున్=తుచ్ఛుడైన ఘంటాకర్ణునకు, వరము=కోరికను, ఇచ్చినావు=తీర్చితివి, నిన్ను, అనయము=ఎల్లపుడు, నమ్మి=నమ్ముకొని, కొల్చిన=సేవించిన, మహాత్ములకు=గొప్పవారికి, ఏమి=ఏది, ఒసంగెదో=యిత్తువో, సనందననుత=సనందనముని చేఁగొనియాడబడినవాఁడా! మాకు = మాకు, ఒసంగుమయ్యా=దానినీయవలయునయ్యా

తా. రామభద్రా! నీకథలను విననిష్టము లేక చెవులకు ఘంటలను గట్టుకొన్న నీచుడగు ఘంటాకర్ణునికోరిక నే తీర్చితివి. అందుచే నిన్ను నమ్మి సేవించు గొప్పభక్తుల కెక్కువ ఫలమిత్తువనుట నిశ్చయము. అట్టిఫలము నే నా కనుగ్రహింపుము.

ఉ. పాపములొందువేళ రణ ♦ పన్నగ భూతభయజ్వరాదులం
దాపదనొందువేళ భర ♦ తాగ్రజ మిమ్ము భజించువారికిం
బ్రాపుగ నీవు దమ్ముఁడిరు ♦ పక్కియలం జని తద్విపత్తినం
తాపము మాన్పి కాతురట ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 45

టీ. పాపములు, పొందువేళన్=పొందుకాలమున, రణ=యుద్ధము, పన్నగ=పాము, భూతభయ=గ్రహబాధవలనిభయము, జ్వర=జ్వరము, ఆదులందు=మొదలగువానియందు, ఆపదన్=కష్టమును, ఒందువేళన్=పొందునప్పుడు, భరతాగ్రజ=భరతునకన్నవైన రామా! మిమ్మున్=మిమ్ము,

భజించువారికిన్=కొల్చువారికి, నీవున్=నీవును, తమ్ముఁడు=నీసోదరుఁడైన లక్ష్మణుఁడును, ఇరుపక్కియలన్=రెండువైపులను, ప్రాపుగ=సాయముగ, చని=వెళ్లి, తద్విపత్తిసంతాపము = ఆకష్టములవలననగు బాధను, మాన్పి = పోఁగొట్టి, కాతురఁట=రక్షింతురట.

తా. శ్రీరామా! మనుజులు వివిధములుగ కష్టముల నందునప్పుడు నిన్ను స్మరించిన నీవును లక్ష్మణుడును వారికి రెండువైపుల నిలిచి కాపాడుదురట. అట్లే నన్ను రక్షింపుము.

చ. అగణితజన్మకర్మదురి ♦ తాంబుధిలో బహుదుఃఖవీచికల్
తెగిపడ నీఁదలేక జగ ♦ తీధవ నీపదభక్తినావచేఁ
దగిలి తరింపఁగోరితి ప ♦ దంపడి నాదుభయంబు మాన్పవే
తగదని చిత్తమం దిడక ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 46

టీ. జగతీధవ=లోకనాథుండవైనరామా! అగణిత = లెక్కింపజాలని, జన్మకర్మదురితాంబుధిలోన్=పుట్టుక కర్మము పాపములనెడు సముద్రమందు, బహుదుఃఖవీచికల్=అనేకవిచారములయొక్క తరంగములు, తెగిపడ=తెగునట్లు, ఈఁదలేక=ఈఁదజాలక, తగిలి=ఆశపడి, నీపదభక్తినావచేన్=నీపాదభక్తియనెడి పడవచే, తరింపన్=దాటుటకు, కోరితిన్=ఆసక్తి నొందితిని, పదంపడి=ఆవెనుక, తగదని=వీనిని రక్షింపకూడదని, చిత్తమందు=నీమనసున, ఇడక = ఉంచుకొనక, నాదుభయంబున్ = నాభయమును, మాన్పవే = పోఁగొట్టుమా?

తా. లోకరక్షకుఁడవైనరామచంద్రా! నేను గణింపరాని జన్మకర్మదురితంబులనెడి సముద్రమున దుఃఖతరంగముల నెట్టి యీదజాలక తపించుచు నీపాదభక్తియను పడవపై నీదుఃఖసముద్రమును దాటింపుమని కోరితిని. వీడు రక్షణీయుఁడు గాడని మనమున దలంపక నాభయమును బోఁగొట్టుము.

ఉ. నే నొనరించుపాపము ల ♦ నేకములైనను నాదుజిహ్వకుం
బానకమయ్యె నీపరమ ♦ పావననామము దొంటిచిల్క రా

మా నను గావు మన్న తుది ♦ మాటకు సద్గతిఁ జెందెఁ గావునన్
దాని ధరింపఁ గోరెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 47

టీ. నేనొనరించు=నేచేసెడి, పాపముల్=పాతకములు, అనేకములైనను, నీపరమపావననామము=మిక్కిలి పరిశుద్ధమైన నీపేరు, నాదుజిహ్వకున్=నా నాలుకకు, పానకము + అయ్యెన్=పానకమాయెను, తొంటిచిల్క=పూర్వ మందొకచిలుక, రామా=రామచంద్రా!, నను=నన్ను, కావుము=రక్షింపుము, అన్నతుదిమాటకు=అనిన కడపటిమాటకు, సద్గతిన్=ముక్తిని, చెందెన్=పొందెను, కావునన్=అందుచే, దానిన్=ఆరామనామమును, ధరింపన్=తాల్చుటకు, కోరెదను=కోరుచున్నాను.

తా. రామచంద్రా! నేను చాలపాపములను జేసియున్నను నీపరిశుద్ధమైన పేరు నానాలుకకు పానక మయ్యెను. ఏలనఁదువా మొందొక చిలుక రామా యన్నంతనే ముక్తి నందెను. కావున యట్టిపేరును నిరంతరము ధ్యానింప గోరెదను.

చ. పరధనముల్ హరించి పర ♦ భామలనంటి పరాన్నమబ్బినన్
మురిపముకాని మీఁదనగు ♦ మోసమెఱుంగదు మానసంబు దు
స్తర మిది కాలకింకరగ ♦ దాహతిపాల్పడనీక మమ్ము నే
తఱిదరిఁ జేర్చి కాచెదవొ ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 48

టీ. పరధనముల్=ఇతరులధనములు, హరించి=దొంగిలించి, పరభామలన్=పరస్త్రీలను, అంటి=తాకి, పరాన్నము=ఇతరులయన్నము, అబ్బినన్=చిక్కిన, మురిపముకాని=ఆనందమేకాని, మీఁదన్=తర్వాత, అగుమోసము=అయ్యెడి మోసమును, మానసంబు=మనస్సు, ఎఱుంగదు=తెలియలేదు, ఇది=ఈమనస్సు, దుస్తరము=దాఁటశక్యము కానిది, కాలకింకర=యమభటుల యొక్క, గదాహతిపాలు=గదలదెబ్బలపాలు, పడనీక=పడునట్లు చేయక, ఏతఱిన్=ఏకాలమున, తరిజేర్చి=ఒడ్డునకుచేర్చి, కాఁచెదవో=రక్షించెదవో?

తా. రామచంద్రా! నాచిత్తము పరులసొత్తు పరస్త్రీలు పరాన్నములు లభించిన నానందపడుచున్నది కాని తర్వాత నందువలననగు మోస మెట్టిదో తెలియ లేదు. నామనసున నట్టిచెడువిషయములను జొరనీయ నడ్డుపెట్ట తరము గాకున్నది. అందుచే యమభటులదెబ్బలపాలు గానీక మంచివిషయముల మీదకే నామనను మరలునట్లు చేసి నన్ను రక్షించుము.

ఉ. చేసితి ఘోరకృత్యములు ♦ చేసితి భాగవతాపచారముల్
చేసితి నన్యదైవములఁ ♦ జేరి భజించిన వారిపొత్తు నేఁ
జేసిన నేరముల్ దలఁచి ♦ చిక్కులఁ బెట్టకుమయ్య యయ్య నీ
దాసుఁడనయ్య భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 49

టీ. అయ్య=ఓరామయ్యా! ఘోరకృత్యములు = నేను భయంకరమైన పనులు, చేసితిన్=చేసితిని, భాగవతాపచారముల్ = భక్తులకపరాధములను, చేసితి, అన్యదైవములన్=నీకంటె నితరదైవములను, చేరి=ఆశించి, భజించిన వారిపొందు=సేవించినవారితో స్నేహము, చేసితి, ఏఁ=నేను, చేసిననేరముల్=చేసినతప్పులను, తలఁచి = తలపుననుంచి, చిక్కులన్ = కష్టములను, పెట్టకుమయ్య = పెట్టవద్దుస్వామీ!, నీదాసుఁడనయ్య = నేను నీభక్తుఁడను సుమా!

తా. శ్రీరామా! నే ననేకభయంకరకార్యములను, నీభక్తులకెుడ నపరాధములను చేసి నీకంటె నితరదేవతలను గొల్చినవారితో స్నేహమును చేసితిని. ఆనాతప్పులను నీమనసున నుంచుకొని నన్ను కష్టములపాలు సేయక నీభక్తుఁడనని యెంచి నన్ను రక్షింపుము.

చ. పరులధనంబుఁ జూచి పర ♦ భామలఁ జూచి హరింపఁ గోరు మ
ద్దురితరమానసం బనెడు ♦ దొంగనుబట్టి నిరూఢదాస్యవి
స్ఫురితవివేకపాశములఁ ♦ జుట్టి భవచ్చరణంబనే మరు
త్తరువునఁ గట్టివేయఁగదె ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 50

టీ. పరధనంబున్=ఇతరులసొత్తును, చూచి, పరభామలన్ = ఇతర స్త్రీలను, చూచి, హరింపన్=గ్రహించుటకు, కోరు=కోరెడి, మద్గురుతరమానసంబు=మిగులగొప్పదైన నామనసు; అనెడుదొంగను = అనునట్టిదొంగను; పట్టి=బంధించి; నిరూఢ=నిశ్చలమైన; దాస్య=సేవకత్వముచే; విస్ఫురిత=ప్రకాశించు; వివేకపాశములన్=జ్ఞానమనెడు త్రాళ్ళతో; చుట్టి=కట్టి; భవచ్చరణంబు=నీపాదము; అనే=అనెడు; మరుత్తరువునన్ = కల్పవృక్షమునకు; కట్టివేయఁగదె=కట్టివేయుమా!

తా. నేరముచేసిన మనుజుని పట్టుకొని త్రాళ్ళతో నొకచెట్టునకు గట్టివైచినట్లు పరస్త్రీధనంబుల కాసపడి సంగ్రహింప నెంచిన నామనసనెడి దొంగను పట్టుకొని గట్టిగా నిను గొల్చుటయను త్రాళ్ళతో బంధించి నీపాదంబనెడి కల్పవృక్షమునకుఁ గట్టివేయుము.

చ. సలలితరామనామజప ♦ సార మెఱుంగను కాశికాపురీ
నిలయుఁడఁగాను మీచరణ ♦ నీరజరేణుమహాప్రభావముం
దెలియ నహల్యఁగానుజగ ♦ తీవర నీదగుసత్యవాక్యముం
దలపఁగ రావణాసురుని ♦ తమ్ముఁడఁగాను భవద్విలాసముల్
తలఁచి నుతింప నాతరమె ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 51

టీ. జగతీవర = రాజశ్రేష్ఠుండవైన రామా! సలలిత = మిగులనింపగు; రామనామజపసారము=రామనామము జపించుటవలనిఫలమును, ఎఱుంగను= తెలియుటకు; కాశికాపురీనిలయుఁడన్=కాశిలో వసించు శివుఁడను; కాను= కాఁజాలను; మీచరణనీరజ=మీపాదపద్మములయొక్క, రేణు = ధూళియందలి; మహాప్రభావముల్=గొప్పప్రభావమును; తెలియన్ = తెలిసికొనుటకు; అహల్యగాను=గౌతమునిభార్యను గాను; నీదగుసత్యవాక్యముల్ = నీమంచి పలుకును; తలఁపఁగన్=యోజించుటకు; రావణాసురునితమ్ముఁడన్ = రావణునిసోదరుఁడైన విభీషణుఁడను; కాను = కాఁజాలను; భవద్విలాసముల్=

నీలీలలను; తలఁచి=స్మరించి; పొగడంగన్ = పొగడుటకు; నాతరమె = నాకు సాధ్యమగునా? (కాదు.)

తా. శ్రీరామచంద్రా! నేను నీనామస్మరణవలనిఫలితము నెఱుంగుటకు శివుఁడను గాను. నీపాదధూళిప్రభావ మిట్టిదని గ్రహించుట కహల్యను గాను. నీసత్యవాక్యము గ్రహించుటకు విభీషణుండనుగాను. కావున నీ లీలలను కొనియాడ నాకు సాధ్యము కాదు.

ఉ. పాతకులైన మీకృపకు ♦ పాత్రులుగారె తలంచిచూడఁ జ
టాత్రికిఁ గల్గె పావన మ ♦ రాతికి రాజ్యసుఖంబు గల్గె దు
ర్జాతికిపుణ్య మబ్బెఁ గపి ♦ జాతిమహాత్వమునొందెగావునన్
దాతవు యెట్టివారలకు ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 52

టీ. పాతకులైనన్=మహాపాపులుకూడ; మీకృపకున్ = మీదయకు; పాత్రులుకారె=తగియుండిరికదా!; తలంచిచూడన్ = ఆలోచించిచూడగా; చటాత్రికిన్ = ఱాయిరై పడియున్న నహల్యకు; పావనము = పవిత్రత; కల్గెన్=కలిగినది; అరాతికిన్=శత్రుకోటిలోవాఁడైన విభీషణునకు; రాజ్యసుఖంబు=రాజ్యలాభము; కల్గెన్=కలిగినది; దుర్జాతికిన్ = నీచజాతివానికి; పుణ్యము; అబ్బెన్=కలిగినది; కపిజాతి = కోఁతులమూక; మహాత్త్వమున్= గొప్పతనమును; ఒందెన్=పొందెను; కావునన్=అందుచే; ఎట్టివారలకున్= ఎంతతక్కువవారికిఁగూడ; దాతవు=నీవు కోరిన దిచ్చువాఁడవు.

తా. జానకీపతీ! ఎంతపాపులైనను నీవు దయదలతువని యెఱుంగుదును. గౌతమునిశాపముచే ఱాయిగ పడియున్న అహల్యకు నీపాదరేణువుచే స్త్రీరూప మొసంగితివి. పగవానితమ్ముఁడైన విభీషణునకు రాజ్య మొసంగితివి. నీచజాతివాఁడైన గుహుని పుణ్యాత్మునిగ జేసితివి. అల్లరిమూకలైన కోతులు నీకు సాయమొనర్చుటచే గొప్పవారైరి. నీవందఱకును దాతవగుట పాపినైన నన్నుగూడ రక్షింపుము.

ఉ. మామకపాతకవ్రజము ♦ మాన్పనశక్యము చిత్రగుప్తు డే
మేమని వ్రాయనో శమనుఁ ♦ డేమి విధించునొ కాలకింకర
స్తోమ మొనర్చు టే మొ విన ♦ జొప్పడ దింతకుమున్న దీనచిం
తామణి యెట్లుగా చెదవొ ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 53

టీ. దీనచింతామణి = దీనులపాలిటికి చింతామణి వంటివాఁడవైన రామా! మామకపాతకవ్రజము = నాచేసిన పాపములరాశి; మాన్పన్ = రూపుమాపుటకు; అగణ్యము = లెక్కింపరానిది; చిత్రగుప్తుఁడు = యమునిదగ్గరనుండు కరణము; ఏమేమని = నా పేర నెట్టిపాపములు చేసితినని; వ్రాయునో = వ్రాయువాఁడో; శమనుఁడు = యముఁడు, ఏమి = ఏశిక్ష; విధించునో = నిర్ణయించునో; కాలకింకరస్తోమము = యమభటులగుంపు; ఒనర్చుటేమొ = ఏమి చేతురో, వినన్ = వినుటకు, చొప్పడదు = తగియుండదు, ఇంతకమున్న = పైవారిపనులను జేయకముందె; ఎట్లుగా చెదవో = వన్నెట్లు రక్షించెదవో.

తా. ఓదీనబంధుఁడవైన రామా! నేను లెక్కలేనన్ని పాపములను జేసితిని. చిత్రగుప్తుఁడు వాటినిగూర్చి యేమి వ్రాయునో, యముఁ డెట్టిశిక్ష వేయునో, యమభటు లెట్లు బాధింతురో తెలియదు. ఇట్టి యాపదలు నాకు గలుగకముందే నన్ను రక్షించుభారము నీది.

ఉ. దాసిన చుట్టమా శబరి ♦ దాని దయామతి నేలినావు నీ
దాసునిదాసుఁడా గుహుఁడు ♦ తావకదాస్య మొసంగినావు నే
జేసినపాపమో వినుతిఁ ♦ జేసిన గావవు కావు మయ్య నీ
దాసులలోన నే నొకఁడ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 54

టీ. శబరి = బోయది, దాసినచుట్టమా = దగ్గఱబంధువా? దానిన్ = ఆశబరిని, దయామతిన్ = మిగులదయతో, ఏలినావు = కాపాడితివి, గుహుఁడు = గుహుఁడను కిరాతుఁడు, నీదాసునిదాసుఁడా = నీభక్తునిబంటా? తావక దాస్యము = నీకైంకర్యమును, ఒసంగినావు = ఇచ్చితివి, నేన్ = నేను, చేసిన

పాపమో=పాపము చేసితినా? వినుతిక్=పొగడ్తను, చేసినన, కావవు=రక్షింపవు, నీదానులలోనక్=నీభక్తులలో, ఏను=నేను, ఒకఁడను=ఒక్కఁడను, కావుమయ్యా=రక్షింపుము.

తా. నీకు శబరి దగ్గరబంధువురాలు కాదు. గుహుఁడు నీదాసానుదాసుఁడును గాఁడు. వారిద్దఱివలన సేవల నందితివి. నే నేమి పాప మొనర్చితినో యెంత వేడినను రక్షింపకుంటివి. శబరీగుహులను రక్షించినట్లు నీదానులలో నొక్కఁడనైన నన్నుఁగూడ రక్షింపుము.

ఉ. దీక్ష వహించి నాకొలఁది ♦ దీనుల నెందఱి గాచితో జగ
ద్రక్షక తొల్లి యాద్రుపద ♦ రాజతనూజ తలంచినంతనే
యక్షయ మైనవల్వ లిడి ♦ తక్కట నామొఱ చిత్తగించి ప్ర
త్యక్షము గావ దేమిటికి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 55

టీ. జగద్రక్షక=లోకములను గాపాడురామా! దీక్షవహించి=ప్రతినబూని, నాకొలఁదిదీనులన్ = నావంటిదిక్కులేనివారిని, ఎందఱిన్=ఎంతమందిని, కాచితో=రక్షించితివో, తొల్లి = పూర్వము, ఆద్రుపదరాజతనూజ = ద్రుపదునికూఁతురగుద్రౌపది, తలంచినంతనే = కృష్ణాయని స్మరింపగానే, అక్షయమైన=తఱుఁగని, వల్వలు=వస్త్రములు, ఇడితి=ఇచ్చితివి, అక్కట=అయ్యో!, నామొఱ=నాయార్తి, చిత్తగించి=విని, ప్రత్యక్షము=ఎదుటబడునట్లు, అదేమిటికి=ఎందు చేతనో, కావు=అగపడవు.

తా. లోకరక్షకుండవైనరామా! నావంటిభక్తుల నెందరనో నీవు కాపాడుచున్నావు. పూర్వము దుశ్శాసనుండు కౌరవసభలో తనవస్త్రముల నొల్చుచుండ ద్రౌపదీదేవి కృష్ణా కావుమన్నంతనే యామెకుఁ దఱుగని చీరలిచ్చి మానరక్షణ మొనర్చితివి. అట్లే నా కెందులకు ప్రత్యక్షమై నా మొఱ నాలకింపవు.

ఉ. నీరఘురాభమూర్తిఁగను ♦ నిష్టఁ గనుంగొనఁ గోరి వేడినన్
జాలము సేసి డాఁగెదవు ♦ సంస్తుతి కెక్కిన రామనామమే

యేచాలను దాఁచుకోఁగలవు ♦ ముక్తికిఁబ్రాపది పాపముల్కు
ద్దాలముగాదె మాయెడల ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 56

టీ. నీల=నల్లనగు, ఘన=మేఘమునకు, అభ = సాటియగు, మూర్తి వగు=శరీరము కలవాఁడవైన, నిన్నున్=నిన్ను, కనుంగొనక=చూడఁదలంచి, వేఁడినన్=కోరినను, జాలము చేసి=మాయజేసి, డాఁగెదవు=దాఁగుకొందువు, సంస్తుతికెక్కిన=ప్రఖ్యాతినందిన, రామనామము, ఏచాలను = ఏచాటున, దాఁచుకోఁగలవు = దాఁచిపెట్టుదువు, అది = ఆరామనామము, ముక్తికిన్= మోక్షమునకు; ప్రాపు=అండ; మాయెడలన్=మావంటివారిపట్ల; పాపముల = పాపములను మొదళ్ళకు, కుద్దాలము గాదె=గడ్డపాఱవంటిదిగదా!

తా. శ్రీరామా! నీలమేఘశరీరుండవగు నిన్నుఁ జూడఁదలంచి యెంత ప్రార్థించినను నాకగపడకుంటివి. నీవట్లు దాఁగినను ప్రసిద్ధినొందిన నీపే రెచ్చట దాఁచగలవు. ఆనీనామమును సదా మేము ధ్యానించుటవలన గుద్దలి భూమిలోఁ బాతికొన్న వ్రేళ్ళను మొదలంట ఛేదించినట్లు మాపాపములను ఛేదించి ముక్తి నొసఁగును.

చ. వలదుపరాకు భక్తజన ♦ వత్సల నీచరితంబు వమ్ము గా
వలదు పరాకు నీబిరుదు ♦ వజ్రమువంటిది కావ కూరకే
వలదు పరాకు నాదురిత ♦ వార్ధికిఁ దెప్పవుగా మనంబులోఁ
దలఁచెదమె కానిరంతరము ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 57

టీ. భక్తజనవత్సల = భక్తులందు దయగలరామా!; పరాకు = జాగ్రత; నీచరితంబు = నీచరిత్రము, వమ్ముగావలదు = వ్యర్థముకాగూడదు; నీబిరుదు= నీబిరుదము, వజ్రమువంటిది=వజ్రమువలె గట్టిది; పరాకు=జాగ్రత; కావక= నన్నురక్షింపక, ఊరకే=వ్యర్థముగా, వలదు = వద్దు, పరాకు, నాదురితవార్ధి

కిన్=పాపసముద్రమునకు, తెప్పవుగా = దాఁటునావగా; నిరంతరము= ఎల్లపుడు, మనములోన్=మనసునందు, తలఁతుమె కా=తలఁచుచుందుముక దా!

తా. భక్తులందు దయగల రామా! నీకు శరణాగతరక్షణుండవన్న బిరుదు గలదు. పైగా నీవు దాసులను బ్రోవువాఁడవని ఖ్యాతి నందితివి అట్టి నీవు నన్నుఁ గాపాడక నీబిరుదమును చరితమును వ్యర్థము సేయకుము. పాపసముద్రమునకుఁ నిన్నే తెప్పగాఁ జేసికొని దాఁట నెంచితిని.

ఉ. తప్పు లెఱుంగలేక దురి ♦ తంబులు సేసితినంటి నీవు మా
యప్పవు గావుమంటి నిఁక ♦ నన్యులకు న్నుదు రంటనంటి నీ
కొప్పిదమైన దానజను ♦ లొప్పినబంటుకు బంట నంటి నా
తప్పుల కెల్ల నీవె గతి ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 58

టీ. తప్పులు=దోషములు, ఎఱుంగలేక=తెలిసికొనలేక, దురితంబులు= పాపములను, చేసితినంటి=చేసితినన్నాను, నీవు, మాయప్పవు=మాయయ్యవు, కావుమంటిన్=రక్షింపుమంటిని, ఇఁకన్=ముందు, అన్యులకున్ = ఇతరులకు; నుదురంటనంటి=నమస్కరింపనన్నాను, నీకు, ఒప్పిదమైన = ఇష్టమైన, దాస జనులు=భక్తులు; ఒప్పినబంటుకు=ఇష్టపడినభక్తునకు, బంటునంటిన్=దాసుఁడ నంటిని, నాతప్పులకెల్లన్=నాతప్పులన్నిటికిని, నీవెగతి=నీవే దిక్కు.

తా. తప్పు లిట్టివని యెఱుఁగ కనేకపాపము లొనర్చితిని. నీవు మాతండ్రివి. కాపాడుమంటిని. నీకంటె నితరులకు దండమిడఁబోనంటిని. నీకిష్టుఁడైన భక్తునకు దాసుఁడ నంటిని, నాతప్పులన్నిటిని క్షమించి కాపాడు భారము నీదే.

చ. ఇతఁడు దురాత్ముఁడంచు జను ♦ లెన్నగ నాఱడిఁ గొంటి నేనపో
పతితుఁడ నంటి నోపతిత ♦ పావనమూర్తివి నీవు గల్గ నే

నితరుల వేడనంటి నిహ ♦ మిచ్చిననిమ్ము పరం బొసంగుమీ
యతులితరామనామమధు ♦ రాక్షరపాళి నిరంతరంబు హృ
ద్గతమనినమ్మి కొల్చెదను ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 59

టీ. ఇతఁడు = వీఁడు, దురాత్ముఁడంచు = చెడ్డవాఁడని, జనులు = లోకులు; ఎన్నఁగన్=తలఁచఁగా, అబ్బడిగొంటి = అల్లరిపడితిని, నేనెపో= నేనె, పతితుఁడనంటిఁ=మహాపాపి నంటిని; ఓపతితపావనమూర్తివి=పాపుల పాపములఁబాపు రూపముకల, నీవుకల్గన్=నీవుండగా; ఏన్=నేను; ఇతరులన్=నీకన్న వేరువారిని; వేఁడనంటిన్ = కోరనంటిని, ఇహము = భూలోక సుఖము, ఇచ్చినన్=ఈయఁదలంచిన, ఇమ్ము=ఒసఁగుము, పరంబు=పరలోక సుఖము, ఒసంగుమీ=ఇమ్ము!, అతులిత=సాటిలేని, రామనామ=రామనామ మందలి; మధురాక్షరపాళి=తీయనైన యక్షరపంక్తిని, నిరంతరంబు = సదా, హృద్గతమని = నామనమునన్నదని; నమ్మి = విశ్వసించి, కొల్చెదను = ధ్యానింతును.

తా. శ్రీరామా! పరులచే మహాపాపుఁడని నిందఁబడితిని. అట్లే నేను గూడ పాపినని చెప్పికొంటిని. ఎంతపాపినైనను సదా నిన్నుదక్క నితరులను గొల్వకుండుటచే నిహపరలోకసుఖములం దేది నా కీయఁదలంచితివో దానిని యిమ్ము. ఏది యిచ్చినను విచారము లేదు. తియ్యనైన నీనామాక్షరములను సదా మనసున ధ్యానించుచున్నాను.

ఉ. అంచితమైన నీదుకరు ♦ ణామృతసారము నాదుపైని బో
ర్లించినఁజాలు దాన నిర ♦ సించెద నాదురితంబులెల్లఁ దూ
లించెద వైరివర్గ మెడ ♦ లించెదఁ గోర్కుల నీదుబంటనై
దంచెదఁ గాలకింకరుల ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 60

టీ. అంచితమైన=పూజనీయమగు; నీదుకరుణామృతసారము = నీదయ యనెడి యమృతపుతేటను, నాదుపైనిన్=నాపైన, ప్రోక్షించినన్ = చల్లిన; చాలు=చాలును; దానన్=దానిచే; నాదురితంబులెల్లన్=నాపాపములన్నియు; నిరసించెదన్=నాశమొనర్తును, వైరివర్గము = అంతశ్శత్రువులగు కామక్రోధాదులను; తూలించెదన్=చెదరఁగొట్టుదును, కోర్కులను = ఆశలను; ఎడలించెదన్=బయటకుఁ దరుముదును, నీదుబంటనై=నీదాసుండనై; కాలకింకరులన్=యమభటులను, దంచెదన్=పిండియొనర్తును.

తా. రామచంద్రా! నాపైని నీదయామృతంపుతేట నించుకఁ జల్లితివా నాపాపములను బోగొట్టుకొని, నాలోనున్న కామక్రోధాదివైరులను రూపుమాపి కోర్కెలను దూరముజేసి నీభక్తుఁడనై యమదూతలను తఱిమెదను.

చ. జలనిధులేడు నొక్కమొగిఁ జ ♦ క్కికిఁదెచ్చెశరంబు ఱాతినిం
పలరఁగఁ జేసె నాతిగఁ బ ♦ దాబ్జపరాగము నీచరిత్రముం
జలజభవాదినిర్జరులు ♦ సన్నుతి సేయఁగ లేరు గావునం
దలఁపనగణ్యమయ్యయిది ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 61

టీ. శరంబు=నీబాణము, జలనిధులు=సముద్రములు; ఏడున్ = ఏడింటిని, ఒక్కమొగిన్ = ఒక్కపర్యాయము; చక్కికిన్ = ఒకచోటునకు, తెచ్చెన్=చేర్చెను, పదాబ్జపరాగము = నీపాదపద్మమందలిధూళి, ఱాతిన్=ఱాయిని, ఇంపలరన్=చక్కగా, నాతిగన్ = స్త్రీగా; చేసెన్=చేసెను, నీచరిత్రమున్=నీనడవడి యిట్టిదని; జలజభవాదినిర్జరులు = బ్రహ్మాదిదేవతలు, సన్నుతిన్=స్తోత్రమును; చేయగలేరు=చేయఁజాలరు; కావునన్ = అందుచే; యిది=నీమహిమ, తలఁపన్ = తలంచుటకు, అగణ్యమయ్యా = అశక్యముగాని దయ్యా!

తా. శ్రీరామా! నీబాణ మొక్కటి సప్తసముద్రముల నొకచోటికి గొనివచ్చెను. నీపాదపద్మమందలిదుమ్ము తగిలినంత ఱాయి సుందరీమణి యయ్యెను. ఇట్టి నీనడవడి యిట్టిదని సృష్టికర్తయైన బ్రహ్మ మొదలగు దేవతలుకూడ పొగడజాలనప్పుడు సామాన్యమానవుడనైన నాకు సాధ్యమెట్లగును?

ఉ. కోతికి శక్యమా యసుర • కోటుల గెల్వను గెల్చెఁబో నిజం
బాతనిమేన శీతకరుఁ • డౌట దవానలుఁ డెట్టివింత మా
సీతపతివ్రతామహిమ • సేవకుభాగ్యము మీకటాక్షమున్
ధాతకు శక్యమా పొగడ • దాశరథీ కరుణాపయోనిధీ! 62

టీ. కోతికి=హనుమంతునకు, అసురకోటులన్=రాక్షససమూహమును, గెల్వరు=జయించుటకు; శక్యమా=సాధ్యమా? గెల్చెఁబో=జయించినాఁ డను కొందము; దవానలుఁడు=దావాగ్ని; అతనిమేనన్=అహనుమంతుని శరీరమున, శీతకరుఁడౌట=చల్లదనము నిచ్చువాఁడగుట, ఎట్టివింత = ఎంతయాశ్చర్యమైన విషయము? మాసీతపతివ్రతామహిమ = మాజానకీదేవిపతివ్రతామాహాత్మ్యము, సేవకుభాగ్యము=సేవకుఁడైన హనుమంతుని యదృష్టము, మీకటాక్షమున్=మీదయతోఁగూడిన చూపు, పొగడన్=కొనియాడుటకు, ధాతకు=బ్రహ్మకు, శక్యమా=సాధ్యముకాదు.

తా. ఒక్కకోతిగా దుద్దండులైన రాక్షసవీరుల నందరను జయించుట సాధ్యమైనపని కాదు. ఎట్లో జయించినవాఁ డనుకొందము. అహనుమంతునితోకకు నూనెతోఁ దడిపిన గుడ్డలు కట్టి యగ్ని రగుల్ప నాయగ్ని వానికి చల్లదనమునే యొసంగు టెంతో యాశ్చర్యము. వీనికి సీతాదేవిపాతివ్రత్యప్రభావము, అహనుమంతుని యదృష్టము; మీదయాంతకరణము కారణములు. ఇట్టితమదయను పొగడ బ్రహ్మకుగూడ శక్యముగాదు.

ఉ. భూపలలామ రామ రఘు ♦ పుంగవ రామ త్రిలోకరాజ్యసం
స్థాపనరామ మోక్షఫల ♦ దాయకరామ మదీయపాపముల్
పాపగదయ్య రామ నిను ♦ బ్రస్తుతిసేసెదనయ్య రామ సీ
తాపతి రామ భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 63

టీ. భూపలలామ=రాజశ్రేష్ఠుండవైన; రామ=శ్రీరాముఁడా!, రఘు పుంగవ=రఘువంశపురాజులలో ఘనుండవైన, రామ=రామచంద్రా! త్రిలోక రాజ్యసంస్థాపన=మూడులోకములందలి రాజ్యములను స్థాపించినవాఁడవైన, రామ!; మోక్షఫలదాయక = మోక్షమనెడి ఫలమును జేకూర్చువాఁడవైన; రామ!, రామ!, సీతాపతిరామ=సీతాదేవిభర్తవైన రామచంద్రా!; మదీయ పాపముల్=నేఁజేసినపాపములను, పాపగదయ్య = పోఁగొట్టుమా!; నినున్= నిన్ను, ప్రస్తుతి=స్తోత్రము, చేసెదనయ్య=చేతును.

తా. రాజశ్రేష్ఠుండవు, రఘువంశపురాజులలో వగ్రగణ్యుఁడవు ముజ్జగంబులందలి రాజ్యములను గట్టిపరచినవాఁడవునై; సీతాదేవికిఁ బ్రియుం డవైన రామా! నిన్నే ధ్యానింతును నాపాపములను బోఁగొట్టుము.

ఉ. నీసహజంబు సాత్త్వికము ♦ నీవిడిపట్టు సుధాపయోధి ప
ద్మాసనుఁడాత్మజుండు గమ ♦ లాలయ నీప్రియురాలు నీకు సిం
హాసన మిద్ధరిత్రి గొడు ♦ గాకసమక్షులు చంద్రభాస్కరుల్
నీసుమతల్ప మాదిఫణి ♦ నీవె సమస్తము గొల్చినట్టి నీ
దాసులభాగ్య మెట్టిదయ ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 64

టీ. నీసహజంబు = నీకుఁ బుట్టుకతోనున్నగుణము, సాత్త్వికము = సత్త్వగుణము; నీవిడిపట్టు = నీకు విడిది; సుధాపయోధి = పాలసముద్రము,

పద్మాసనుఁడు=బ్రహ్మ, ఆత్మజుండు=కొడుకు, కమలాలయ=శ్రీయాదిలక్ష్మి, నీప్రియురాలు = నీప్రేమకుఁ బాత్రురాలైన యిల్లాలు, నీకు, ఇద్ధరిత్రి=ఈ భూమి, సింహాసనము = కూర్చుండుగద్దె, ఆకసము=ఆకాసము, గొడుగు, చంద్రభాస్కరుల్=సూర్యచంద్రులు, అక్షులు = కన్నులు, నీనుమతల్పము= నీపూలపాన్పు; ఆదిఫణి = ఆదిశేషువు. నీవె, సమస్తము = అంతయు, కొల్చి నట్టి=నిన్ను సేవించునట్టి, నీదాసులభాగ్యము = నీభక్తుల యదృష్టము, ఎట్టి దయ=ఎంతటిదని చెప్పఁదగినది.

తా. రామచంద్రా! సత్వగుణము నీకు బుట్టుకతోడనే కలదు. పాల సముద్రము నీ నివాసము. నీకొడుకు బ్రహ్మ. భార్య యాదిలక్ష్మి. సింహాస నము భూమి. ఆకాశము గొడుగు సూర్యచంద్రులు కన్నులు. ఆదిశేషువు నీపాన్పు. నీవే సర్వజగదాధారుఁడవు. నిన్ను భజించు సేవకుల యదృష్ట మిట్టిదని చెప్పశక్యము కాదు.

చ. చరణము సోఁకినట్టి శిల ♦ జవ్వనిరూపగు టొక్కవింత సు
స్థిరముగ నీటిపై గిరులు ♦ దేలిన దొక్కటివింత గాని మీ
స్మరణఁ దవర్చుమానవులు ♦ సద్గతిఁ జెందిన దెంతవింత యీ
ధరను ధరాత్మజారమణ ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 65

టీ. ధరాత్మజారమణ = భూపుత్రియగు సీతాదేవికిఁ బ్రియుండవైన రామచంద్రా! ఈధరను = ఈభూమియందు, చరణము = పాదము, సోఁకి నట్టి = తగిలిన; శిల=ఱాయి, జవ్వనిరూపగుట = నడివయసుగలస్త్రీయగుట, ఒక్కవింత=ఒకయాశ్చర్యము; నీటిపైన్=నీటిమీద, గిరులు = పర్వతములు, సుస్థిరముగన్=కదలకుండగా, తేలినది=తేలుట, ఒక్కటి వింతగాని=ఆశ్చర్య ముగాని, మీస్మరణన్ = మీధ్యానమును, తనర్చు = చేయు, మానవులు = మనుష్యులు, సద్గతిన్=ముక్తిని; చెందినది = చెందుట, ఎంతవింత = ఎంతటి యాశ్చర్యము.

తా. రామచంద్రా! నీ కాలిదుమ్ము తగిలినంతనే ఱాయి సుందరీమణి యగుటొక గొప్పవింత. సముద్రమునకు వారధి గట్టునపుడు పర్వతములు నీటిపై దేలుట మఱొకవింత. వీనిమాటయటుంచి యెంతపాపాత్ముఁడైన నొక్కమారు మిమ్ము స్మరించినంత మోక్షమబ్బుట చాలగొప్పవింత.

ఉ. దైవము తల్లిదండ్రి తగు ♦ దాత గురుండు సఖుండు నిన్నె కా
భావన సేయుచున్నతఱి ♦ పాపములెల్ల మనోవికారదు
ర్భావితుఁ జేయుచున్నవి కృ ♦ పామతివై నను గావుమీ జగ
త్పావనమూర్తి భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 66

టీ. జగత్పావనమూర్తీ=లోకమును బరిశుద్ధిఁ జేయగల రూపముగల శ్రీరామా!, దైవము = దేవుఁడు, తల్లి, తండ్రి, తగుదాత = కోరినకోర్కెల నిచ్చువాఁడు, గురుండు=గురువు, సఖుండు = స్నేహితుఁడు, నిన్నె కాన్= నీవేయని, భావన = ఊహ, చేయుచున్నతఱిన్ = చేయుచున్నపుడు, పాపములెల్లన్=అన్నిపాపములును, మనోవికారదుర్భావితున్=మనోవికలతను దురూహలుగలవానిగా, చేయుచున్నవి=చేయుచుండెను, కృపామతివై = దయగలవాఁడవై, ననున్=నన్ను, కావుమీ=రక్షింపుము.

తా. లోకపావనుండవైన రామచంద్రా! నీవె దేవుఁడు తల్లి తండ్రి దాత, గురుఁడు, స్నేహితుడవునని యూహించుకొనుచుండ నాపాపములు మనసును కలతపరచుచున్నవి. దయతో నట్టివికారము కలుగనీయకుండ రక్షింపుము.

ఉ. వాసవరాజ్యభోగసుఖ ♦ వార్ధిని దేలు ప్రభుత్వమబ్బినా
యాసకు మేరలేదు కన ♦ కాద్రిసమానధనంబు గూర్చినన్
గాసును వెంటరాదు కని ♦ కానక చేసిన పుణ్యపాపముల్

పీసరవోవ నీవు పది ♦ వేలకుఁ జాలు భవంబు నొల్ల నీ
దాసునిగాఁగ నేలికొను ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 67

టీ. వాసవరాజ్య=ఇంద్రునిరాజ్యముయొక్క; భోగసుఖ = అనుభవించుటచేనైన సుఖమునెడు, వార్ధిని=సముద్రమందు, తేలంద్రభుత్వము=తేలెడు దొరతనము, అబ్బినా = దొరకినను, ఆశకు, మేరలేదు = పరిమితిలేదు, కనకాద్రిసమానధనంబు = మేరుపర్వతమంతధనరాశిని, కూర్చినన్ = కూడఁబెట్టినను, కాసును = దమ్మిడీకూడ, వెంటరాదు = చచ్చినపుడు కూడా రాదు, కనికానక = చూచిచూడక, చేసిన, పుణ్యపాపముల్ = మంచిచెడ్డలు, పీసరవోవనీవు=కొంచెమైన తక్కువ కానీయవు, పదివేలకున్ = పదివేలజన్మములకైనను, చాలు=చాలును, భవంబున్ = పుట్టుకను, ఒల్లన్ = అంగీకరింపను, నీదానునిగాగన్=నీదాసుఁడనగునట్లు, ఏలుకొనుము=రక్షింపుము.

తా. శ్రీరామా! స్వర్గరాజ్యసుఖమువంటి సుఖమబ్బినను, మేరుపర్వతమంత ధనరాశి సంపాదించినను ఆశ కంతము లేదు. ఇంకను సుఖము, ఇంకను ధనమును కోరుచుందును. ఇంతకూడబెట్టినను చచ్చునపుడొక దమ్మిడీకూడ వెంటగొనిపోలేను. చూచియు చూడకయు చేసిన మంచిచెడ్డ పనులమాత్ర మనుభవించి తీరునట్లు చేయుచున్నావు. కావున యీజన్మలో జేసినపాపములు పదివేలజన్మలకుకూడ యనుభవించుటకు సరిపడును. ఈపైన నాకు జన్మయే అక్కరలేదు. నన్ను నీదానునిగా జేసుకొని రక్షింపుము.

ఉ. నూఱిజముల్ దయావరులు ♦ నూనృతవాదులులుబ్ధమానవుల్
వీరపతివ్రతాంగనలు ♦ విప్రులు గోవులు వేదముల్ మహీ
భారము దాల్పఁగా జనులు ♦ పావనమైన పరోపకార స
త్కార్యము లెటుఁగలే రకట ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 68

టీ. సూరిజనుల్ = విద్వాంసులు, దయాపరులు = దయగలవారు, సూనృతవాదులు = నిజమును బల్కువారు, అలుబ్ధమానవుల్ = లోభిత్వము తెలియనిమనుజులు, వీరపతివ్రతాంగనల = వీరత్వముగలిగి భర్తనే దైవముగా భావించు స్త్రీలు, విప్రులు = బ్రాహ్మణులు, గోవులు = ఆవులు, వేదముల్ = ఋగ్వేదాదినాల్గువేదములు, మహీభారమున్ = భూభారమును, తాల్పగా = ధరింపగా, జనులు, పావనమైన = పవిత్రమగు, పరోపకారసత్కారము = ఇతరులకు మేలుచేయుటనెడి మంచిపని, ఎఱుంగలేరు = తెలియలేరు, అకట = ఎంతకష్టము?

తా. పండితులు, దయావంతులు, నిజముపల్కువారు, లుబ్ధులుకాని వారు, పతివ్రతలు, బ్రాహ్మణులు, ఆవులు, వేదములు మొదలగు పుణ్య సమూహము భూభారమును దాల్చియుండగా జనులు పరోపకారసత్కారము లిట్టివని తెలియలేదుకదా!

ఉ. వారిచరావతారమున ♦ వారిధిలోఁ జొఱఁబాఱి క్రోధ వి
స్తారగుఁడైన యానిగమత ♦ స్కరవీరనిశాచరేంద్రునిం
జేరివధించి వేదముల ♦ చిక్కెడలించి విరించికిన్ మహో
దారత నిచ్చి తీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 69

టీ. వారిచరావతారమునన్ = మత్స్యావతార మెత్తినపుడు, వారధి లోన్ = సముద్రములో, చొరబాఱి = ప్రవేశించి, క్రోధవిస్తారగుఁడైన = కోప మెక్కుడుగాగలవాఁడైన; ఆనిగమతస్కర = వేదమును దొంగిలించిన, వీర నిశాచరేంద్రునిన్ = పరాక్రమశాలియగు రాక్షసరాజైన సోమకాసురుని, చేరి = దగ్గటి, వధించి = చంపి, వేదములచిక్కు = వేదములయాపదను, ఎడలించి = తొలగించి, విరించికిన్ = బ్రహ్మకు, మహోదారతన్ = గొప్పధైర్యముతో, ఇచ్చితి = ఇచ్చినది, ఈవెకద = నీవేగదా!

తా. రామచంద్రా! తొల్లి రాక్షసరాజైన వీరుఁడగు సోమకా సురుఁడు వేదముల నపహరించి సముద్రమున దాగియుండగా నీవు మత్స్యావ తారమెత్తి సముద్రములోఁ జొఱఁబడి ధైర్యముతో వానిం జంపి వేదము లను గ్రహించి బ్రహ్మకు మరల నిచ్చినాఁడవుగదా!

చ. కరమనురక్తి మంధరము ♦ కవ్వముగా నహిరాజు త్రాడుగా
దొరకొని దేవదానవులు ♦ దుగ్ధపయోధిమధించుచున్న చో
ధరణిచలింప లోకములు ♦ తల్లడమందఁగఁ గూర్మమై ధరా
ధరము ధరించితీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 70

టీ. దేవదానవులు = దేవతలు రాక్షసులును, కరము = మిగుల; అను రక్తిన్ = అనురాగముతో; మంధరమున్ = మందరపర్వతమును, కవ్వముగాన్ = కవ్వముగాను, అహిరాజు = సర్పరాజైన వాసుకి, త్రాడుగా = అకవ్వమునకుఁ జుట్టిన త్రాడుగను, దొరఁకొని = ప్రయత్నించి, దుగ్ధపయోధిన్ = పాలసము ద్రమును, మధించుచున్నచోన్ = చిలుకుచుండగా, ధరణి = భూమి, చలింప = కదలగా, లోకములు = స్వర్గము మొదలగు పదునాల్గులోకములు, తల్లడమంద గన్ = కంగారుపడ, కూర్మమై = తాఁబేలయి, ధరాధరమున్ = ఆమందరపర్వత మును, ధరించితివి = నీవు పైఁదాల్చినది, ఈవెకద = నీవేగదా!

తా. అమృతమునకై దేవరాక్షసులు పాలసముద్రమును మంధరపర్వత మును కవ్వముగను, వాసుకిని కవ్వపుత్రాడుగను చేసి మధించుచుండగా పదునాల్గులోకములును భూమియు నల్లలనాడి భీతిచెంద నాపర్వతమును తాబేలురూపమున మూపునధరించి యవలీల పైకెత్తి వారిని రక్షించినది నీవేకదా!

ఉ. ధారుణిఁ జాపఁ జుట్టినవి♦ధంబునఁ గైకొని హేమనేత్రుఁడ
వ్వారిధిలోనఁ డాఁగినను♦ వాని వధించి వరాహమూర్తివై

ధారుణిఁ దొంటికైవడిని ♦ దక్షిణశృంగమునన్ ధరించివి
స్తార మొనర్చి తీవె కద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 71

టీ. హేమనేత్రుఁడు = హిరణ్యాక్షుఁడను రక్కసుఁడు, ధరణిన్ = భూమిని, చాపచుట్టినవిధంబున = చాపనుచుట్టినట్లు, కైకొని = చుట్టి, అవ్వారిధిలోన = ఆసముద్రమందు, డాఁగినను = దాఁగియున్నను, వానిన్ = ఆహిరణ్యాక్షుని, వధించి = చంపి, వరాహమూర్తివై = పందిరూపుఁడవై, ధారుణిన్ = భూమిని, దక్షిణశృంగమునన్ = కుడిప్రక్కకోరతో, ధరించి = పైకెత్తిపట్టుకొని, తొంటికైవడిని = పూర్వమువలె, విస్తారము = విరివి; ఒనర్చితి = చేసినది, ఈవెకద = నీవేగదా!

తా. హిరణ్యాక్షుఁడను రాక్షసుఁడు భూమిని సులభముగా చాపజుట్టినట్టు చుట్టి చంకను బెట్టుకొని సముద్రములోదాగ పందిరూపముదాల్చి వానింజంపి సంద్రమందలి భూమిని కుడికోఱతో పైకెత్తి మామూలుగా చుట్టును విప్పి పఱచినవాఁడవు నీవేకదా!

చ. పెటపెట నుక్కకంబమున ♦ భీకరదంతనఖాంకురప్రభా
పటలము గప్ప నుప్పతిలి ♦ భండనవీథి నృసింహభీకర
స్ఫుటపటుశక్తి హేమకశి ♦ పున్ విదళించి సురారిపట్టి నం
తటఁ గృపఁజూచితీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 72

టీ. ఉక్కుకంబమునన్ = ఉక్కుస్తంభమందు, పెటపెటన్ = పెటపెట యనుధ్వనులు, జనించునట్లు, భీకర = భయముఁ గల్గించు, దంత = పండ్లయొక్క; నఖ = గోళ్ళయొక్క, అంకురప్రభాపటలమా = కొనలకాంతులగుంపు, కప్పఁగ = ఆచ్ఛాదింపగా, ఉప్పతిలి = పుట్టి, భండనవీథిన్ = యుద్ధరంగమందు, నృసింహ = మనుజసింహాకారముతో, భీకర = భయంకరముగ, స్ఫుట = ప్రకటమయ్యెడి,

పటు=బలముకల, శక్తిన్=సామర్థ్యముతో, హేమకశిపున్ = హిరణ్యకశిపుఁడనెడి రాక్షసరాజును, విదళించి=చంపి, సురారిపట్టిన్ = హిరణ్యకశిపుని కొడుకైన ప్రహ్లాదుని, అంతటన్=తర్వాత, కృపతోన్=దయతో, చూచితి=చూచినవాఁడవు, ఈవెకద=నీవేకాదా!

తా. ఉక్కు స్తంభము పటపట మనిధ్వనిజేయుచు పగులగా నృసింహావతారమెత్తి నీదేవు డీస్తంభమం దున్నాడా చూపుమని కొడుకును గద్దించు రాక్షసరాజగు హిరణ్యకశిపుని దంతకాంతులు గోళ్ళకొనలకాంతులు ప్రకాశింపుచుండ భయంకరముగా చీల్చి తర్వాత ప్రహ్లాదుని కాపాడిన నీవు నన్నుగూడ నారీతిగా రక్షింపుము.

చ. పదయుగళంబు భూగగన♦భాగములన్ వెసనూని విక్రమా
  స్పదుఁడగునబ్బలీంద్రునొక♦పాదమునందలక్రిందనొత్తి మే
  లొదవజగత్త్రయంబుఁబురు♦హూతునకియ్యవటుండవైన చి
  త్సదమలమూర్తి వీవెకద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 73

టీ. భూగగనభాగములన్ =భూమ్యాకాశములఁరెండుప్రదేశములందు, పదయుగళంబు=రెండుపాదములను, వెసన్=వేగముగా, ఊని=నిలిచియుంచి, ఒకపాదమునన్=ఒకకాలిచే; విక్రమాస్పదుఁడగు=గొప్పపరాక్రమశాలియైన, అబ్బలీంద్రుని=ఆబలిచక్రవర్తిని, క్రిందన్ = క్రిందివైపుగా, తలన్ = శిరస్సును, ఒత్తి=అదిమిపట్టి, మేలొదవన్ = శుభమగునట్లు, జగత్రయంబున్=మూడులోకములను, పురుహూతునకున్=ఇంద్రునకు, ఇయ్యన్=ఇచ్చుటకు, వటుండవైన = బ్రహ్మచారివిగనైన, చిత్సదమలమూర్తివి = సత్యజ్ఞానానంద స్వరూపుఁడవు, ఈవెకద=నీవేకదా!

తా. బలిచక్రవర్తి స్వర్లోకము నాక్రమించి యింద్రుని నందుండి తరుమగా నాయింద్రుని ప్రార్థనపై వామనావతారమును ధరించి యాబలిచక్ర

వర్తిని మూఁడడుగుల పుడమిని దానమిమ్మని కోరి పుచ్చుకొని యొకపాదముచే భూమిని, ఒకపాదముచే నాకసమును నిండించి మూఁడవపాద మతని నెత్తినెమోపి పాతాళమున కణఁగఁద్రొక్కి మరల యిందునకు స్వారాజ్య పదవి నిచ్చినవాఁడవు నీవేకదా!

చ. ఇరువదియొక్కమారు ధర ♦ ణీశుల నెల్ల వధించి తత్కళే
బరరుధిరప్రవాహమునఁ ♦ బైతృకతర్పణ మొప్పఁజేసి భూ
సురవరకోటికిన్ ముదము ♦ సొప్పడ భార్గవరామమూర్తివై
ధరణి నొసంగి తీవె కద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 74

టీ. భార్గవరామమూర్తి=పరశురామావతారుఁడవై, ఇఱువదియొక్కమాఱు=ఇరువదియొక్క సారులు, ధరణీశులనెల్లన్=రాజులనందరను, వధించి=చంపి, తత్=ఆరాజులయొక్క, కళేబర = శరీరమందలి, రుధిరప్రవాహమునన్=రక్తపువెల్లువతో, పైతృకతర్పణము = పితృదేవతలకుఁ దిలోదకములు, ఒప్పఁజేసి=తగినరీతినొనర్చి, భూసురకోటికిన్ = బ్రాహ్మణసమూహమునకు, ముదము=ఆనందము, చొప్పడన్=కలుగునట్లు, ధారుణిన్=భూమిని, ఒసంగితివి=ఇచ్చినవాఁడవు, ఈవెకద=నీవేకదా!

తా. ప్రపంచమందలి రాజసమూహముతో నిరువదియొక్కసారులు యుద్ధముచేసి వారినందరను జంపి యారక్తముతోఁ బితృదేవతలకుఁ దర్పణములిచ్చి భూమినంతను మరల బ్రాహ్మణుల కిచ్చిన పరశురామావతారుఁడవు నీవేకదా!

చ. దురమునఁ దాటకందునిమి ♦ ధూర్జటివిల్ దునుమాడిసీతనుం
బరిణయమంది తండ్రిపను ♦ పన్ ఘనకాననభూమి కేగి దు

స్త్రరపటుచండకాండకులి ♦ శాహుతి రావణకుంభకర్ణ భూ
ధరములఁ గూల్చి తీవె కద ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. దురమునన్=యుద్ధమందు, తాటకన్ = తాటకయనురక్కసుని, తునిమి=చంపి, ధూర్జటివిల్=శివధనువు, తునుమాడి=విరచి, సీతనున్=జానకీదేవిని, పరిణయమంది=పెండ్లాడి, తండ్రి=దశరథుఁడు, పనుపన్ = పంపగా, ఘనకాననభూమికి=ఘోరమైనయరణ్యప్రదేశమునకు, ఏగి=వెళ్ళి, దుస్తర=అడ్డుటకుఁజాలని, పటు=సమర్థమై, చండ=వాఁడియైన, కాండ=బాణమను, కులిశాహతిన్=వజ్రాయుధపుదెబ్బచే, రావణకుంభకర్ణభూధరములన్=రావణకుంభకర్ణు లనెడి పర్వతములను, కూల్చితివి = కూలఁద్రోసినది, ఈవెకద = నీవేకదా!

తా. తొల్లి తాటకయను రక్కసిని జంపి శివునివిల్లు విరచి సీతను బెండ్లాడి తండ్రిమాటప్రకారము దుర్గమారణ్యముల కేగి వజ్రతుల్యమై మిక్కిలి పదనైన బాణములతో కొండలవలె గంభీరులై యొప్పు రావణకుంభకర్ణులనెడి రాక్షసులను జంపిన శ్రీరామావతారుఁడవు నీవేకదా!

చ. అనుపమయాదవాన్వయ సు♦ధాబ్ధిసుధానిధి కృష్ణమూర్తినీ
కనుజుఁడుగా జనించి కుజ ♦ నావళి నెల్ల నణంచి రోహిణీ
తనయుడనంగ బాహుబల♦దర్పమునన్ బలరామమూర్తివై
తనరినవేల్పు వీవె కద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 76

టీ. అనుపమ = సాటిలేని, యాదవాన్వయ = యాదవవంశమను, సుధాబ్ధి=పాలసముద్రమునకు, సుధానిధీ=చంద్రునివంటివాఁడైన, కృష్ణమూర్తి=శ్రీకృష్ణుఁడు, నీకు, అనుజుఁడుగా=తమ్ముడగునట్లుగా; రోహిణీతనయుఁడు=

రోహిణీదేవికొడుకు, అనంగన్ = అని చెప్పుకొనునట్లుగ, జనించి = పుట్టి, బాహుబలదర్పమునన్=భుజబలగర్వమున, కుజనావళిన్=దుర్మార్గులసమూహ మును, ఎల్లన్=అంతను, అణంచి = నాశమొనర్చి, బలరామమూర్తివై = బల రామావతారుఁడవై, తనరిన=అతిశయించిన, వేల్పువు=దైవమవు, ఈవెకద= నీవేకదా!

తా. పాలసముద్రమునఁ జంద్రుఁడు పుట్టినట్లు శ్రీకృష్ణుఁడు యదువంశ మున నీకుఁ దమ్ముఁడై పుట్టగా రోహిణీదేవికొడుకువై బలరాముఁడను పేరున నవతరించి భుజబలముచే దుష్టులసంహరను రూపుమాపినవాఁడవు నీవేకదా!

చ. సురలు నుతింపఁగా దిగ్వుర ♦ సుందరులన్ వరియింప బుద్ధరూ
పరయఁగ దాల్చితీవు త్రిపు ♦ రాసురకోటిదహించునప్పు డా
హరునకుఁ దోడుగా వరశ ♦ రాసనబాణముఖోగ్రసాధనో
త్కర మొనరించి తీవె కద ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. సురలు=దేవతలు, నుతింపఁగాన్=పొగడుచుండ; త్రిపురసుందరు లన్=మయనిర్మితములగు మూఁడునగరములందలి కాంతలను; వరియింపన్= వరించుటకు; ఈవు=నీవు; బుద్ధరూపు=బౌద్ధావతారమును: తాల్చితి=ధరించి తివి; అరయఁగన్=పరికింపఁగా; త్రిపురాసురకోటిన్ = త్రిపురములందలి రాక్షసమూకలను; దహించునప్పుడు=కాల్చునపుడు; ఆహరునకున్=ఆయీశ్వ రునకు, తోడుగాన్ = సహాయుముగా, వర=శ్రేష్ఠమైన; శరాసన = ధనువు; బాణ=బాణము; ముఖ=మొదలగు; ఉగ్ర=తీవ్రమైన, సాధనోత్కరము=పరి కరములసమూహము; ఒనరించితివి=కూర్చినవాఁడవు; ఈవెకద=నీవేకదా!

తా. దేవతలు త్రిపురసుందరీమణులను కోరుమని ప్రార్థింప నంగీక రించి యిందులకు బౌద్ధావతారమెత్తినది నీవేకదా! మఱియు శివుడు త్రిపుర

ములందలి రాక్షసులను దగులఁబెట్టునపు డశనికి బాసటరై ధనుర్బాణాది సాధనసమూహమును సమకూర్చినవాఁడవు నీవే కదా!

ఉ. సంకరదుర్గమై దురిత ♦ సంకులమైన జగంబుఁజూచి స
ర్వాంకషలీల నుత్తమతు ♦ రంగము నెక్కి కరాసిఁ బూని వీ
రాంకవిలాస మొప్పఁ గలి ♦ కాకృతి సజ్జనకోటికిన్ నిరా
తంక మొనర్చె దీవె కద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 78

టీ. సంకరదుర్గమై = అన్నిజాతు లొక్కటిగనౌటచేఁ బ్రవేశింప రానిదై; దురితసంకులమైన=పాపములచే నావరింపఁబడిన, జగంబున్=లోకమును; చూచి; కలికాకృతిన్=కల్క్యవతారముచే; సర్వంకషలీలన్=అన్నిటి నోరయఁగల; లీలన్=విలాసతో; ఉత్తమతురంగమున్ = మంచిగుఱ్ఱమును; ఎక్కి; కరాసిన్=చేతిలోకత్తిని; పూని=ధరించి; వీరాంకవిలాసము=వీరత్వ చిహ్నలీల; ఒప్పన్=ఒప్పుచుండగా; సజ్జనకోటికిన్ = సజ్జనసమూహమునకు; నిరాతంకము=ఆటంకము లేకుండునట్లు; ఈవె కద = నీవే కదా; ఒనర్చెదు= కావింపఁబోదువు.

తా. జాతులన్నియు కలగాపులగమై వర్ణసంకరమై పాపములతో నిండిన ప్రపంచమును జూచి కల్కిరూపుఁడవై గుఱ్ఱము నెక్కి, చేతినున్న కత్తితో దుష్టులను జంపి శిష్టులను గాపాడి వారికెట్టికష్టములును గలుగకుండ నేయడ్డులేకుండ పరాక్రమము చూపఁబోయెడివాఁడవు నీవే కదా!

చ. మనమున నూహపోహణలు ♦ మర్వక మున్నె కఫాదిరోగముల్
దనువున నంటి మేనిబిగి ♦ దప్పక మున్నె నరుండు మోక్షసా
ధనము ననుసరింపఁగావలయు ♦ దత్త్వవిచారము మానియుండుట
ల్తనువునకున్ విరోధ మిది ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 79

టీ. నరుఁడు=మనుష్యుఁడు, మనమునన్=మనస్సునందు; ఊహాపోహ ణాలు = స్మృతిభావములు; మర్వకమున్నె = మరచిపోకముందే, కఫాదిరోగ ముల్=శ్లేష్మము మొదలగువ్యాధులు; తనువునన్=శరీరమందు; అంటి=తగిలి, మేనిబిగి = శరీరదార్ఢ్యము, తప్పకమున్నె = చెడిపోకుండగనె, మోక్షసాధ నము=ముక్తినొందుట కుపాయము, ఒనరింపగావలయున్ = చేసికొనవలెను, తత్త్వవిచారము = నిత్యానిత్యపదార్థవివేకము, మానియుండుట = చేయక పోవుట, ఇది=ఇయ్యది, తనువునకున్=శరీరమునకు, విరోధము = చెడుగును చేయును.

తా. మనుష్యుఁడు మోక్షమార్గమునకు బోవుసుపాయమును మనస్సు స్మృతితప్పకముందే శ్లేష్మమున్నగు రోగము లావరించి శరీరశక్తి తగ్గకుం డగనే చేసికొనవలయును. మఱియు జీవాత్మపరమాత్మలకుండు భేదము, నిత్యానిత్యవస్తువివేకము విచారింపకుండుట శరీరమునకు హాని కలిగించును.

చ. ముదమున కాటపట్టుభవ♦మోహమదద్విరదాంకుశంబు సం
పదలకొటారు కోరుకుల ♦ పంట పరంబున కాదివైరుల
న్నదనజయించుతోవ విప ♦ దబ్ధికి నావ గదా సదా భవ
త్పదమలనామసంస్మరణ ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 80

టీ. భవత్=నీయొక్క, సత్=మంచిదైన; అమల=పరిశుద్ధమైన, నామ సంస్మరణ=పేరును ధ్యానించుట, సదా=ఎల్లప్పుడు; ముదమునకు=సంతోషము నకు, ఆటపట్టు=అధారము, భవ=సంసారమందలి, మోహ=కోరికయను; మద ద్విరద=మదపుటేనుఁగునకు, అంకుశంబు=కొరడా, సంపదలకొటారు=వైభవ ములకు స్థానము, కోరుకులపంట=కోర్కెల నిచ్చునది, పరంబునకు=మోక్షము నకు, ఆది=మొదలు, అదనన్=తగినకాలమున; వైరులన్ = కామక్రోధములు

మొదలగుశత్రువులను, జయించు = గెలువఁజేయును, త్రోవ = మార్గము, విప దబ్ధికి = కష్టమనెడి సముద్రమునకు; నావగదా = పడవవంటిదిగదా!

తా. శ్రీరామచంద్రా! నీనామమును స్మరించిన నెల్లపుడు సంతోష మును గలిగించును. సంసారమందాసక్తిని మదపుటేనుగును అంకుశ మెట్లు మరలించునో యట్లు చేయును. భోగభాగ్యములను, సమస్తకోర్కెలను నిచ్చును. మోక్షము నొందుటకు మొదటిసాధనము. సమయ మెఱిఁగి కామ క్రోధా ద్యంతశ్శత్రువులను గెల్చుటకు త్రోవ జూపును. కష్టసముద్రమును దాటించును.

ఉ. దురితలతానుసారిభవ ♦ దుఃఖకదంబము రామనామభీ
కరతరహేతిచేఁ దెగి వ ♦ కావకలై చనకుండ నేర్చునే
దరిగొనిమండుచుండుశిఖ ♦ దార్కొనిసన్ శలభాదికీటకో
త్కరము విలీనమై చనదె ♦ దాశరథీ కరుణాపయోనిధీ.81

టీ. దురితలతానుసారి = పాపములనెడి తీగలకుఁ జాఁకెడి, భవదుఃఖ కదంబము = సంసారసంబంధమగు కష్టసమూహము, రామనామ = 'రామ' అనెడి, భీకరతర = మిగులభయంకరమైన; హేతిచే = కత్తిచే, తెగి = ఛేదింపఁబడి; వకావకలై = తుత్తునియలై, చనకుండ నేర్చునే = పోకుండనుండునా?; దరి గొని = పొగలఁజిమ్ముచు, మండుచుండు = తగులఁబడు, శిఖ = అగ్నిజ్వాల; దార్కొనిసన్ = సమీపింపగా, శలభాది = మిడుతలు మొదలగు, కీటకోత్క రము = పురుగులగుంపు, విలీనమై = రూపుమాసినదై; చనదా = నశింపదా?

తా. రామచంద్రా! రామనామస్మరణముచేసిన నది మండుచున్న యగ్నిజ్వాలను జేరిన మిడుతలుమొదలగు పురువులదం డేరీతిగా నశించి పోవునో యట్లే పాపములనెడి తీగలఁ నరికి నశింపజేయును,

చ. హరిపదభక్తి నింద్రియజ ♦ యాన్వితుఁ డుత్తముఁ డింద్రి
యంబులన్ । మరుగక నిల్ప నూఁదివను ♦ మధ్యముఁ డిం
ద్రియపారవశ్యుఁడై । పరఁగినచో నికృష్టుఁ డని ♦ పల్కఁగ
దుర్మతి నైన నన్ను నా । దరమున నెట్లు కాచెదవొ ♦
దాశరథీ కరుణాపయోనిధీ. 82

టీ. హరి=విష్ణుని, పద=పాదములందు, భక్తిన్ = భక్తిచే, ఇంద్రియ
జయాన్వితుఁడు=పంచేంద్రియములను గెల్చినవాఁడు, ఉత్తముఁడు=సజ్జనుఁడు,
ఇంద్రియములన్=అన్ని యింద్రియములను, మరుగక=వశపడక, నిల్పన్=అడ్డు
పెట్టుటకు, ఊఁదినను=ధైర్యమొనర్చిన, మధ్యముఁడు = మధ్యతరగతివాఁడు,
ఇంద్రియవ్యాపారవశ్యుఁడై=ఇంద్రియములవలలోఁబడినవాఁడై, పరఁగినచో=
ఒప్పెనేని, నికృష్టుడు=నీచుఁడు; అని = ఇట్లని, పల్కఁగన్ = శాస్త్రములు
చెప్పుచుండగా, దుర్మతినైన=దుర్మార్గుఁడనైన, నన్నున్=నన్నును; ఆదర
మునన్=మన్ననతో, ఎట్లు=ఏరీతిగా; కాచెదవో=రక్షింతువోగదా!

తా. శ్రీరామచంద్రా! ఇంద్రియములను వశపఱచుకొని విష్ణుభక్తి
కలవాఁడు ఉత్తముఁడని, ఇంద్రియములకు లోఁబడక వానిని అపువాఁడు
మధ్యముఁడని, ఇంద్రియలోలుఁడై వానియిష్టము వచ్చినట్లులొంగి తిరుగువాఁ
డధముఁడని శాస్త్రములు చెప్పుచున్నవి. నేనందు దుష్టుఁడనై యధముఁడ
నైతినిగాన నీవు నన్ను దయతో నెట్లు రక్షింతువో?

చ. వనకరిచిక్కె మైనసకు ♦ వాచవికిం జెడిపోయె మీను తా
వినికికిఁ జిక్కెఁ జిల్వ కను ♦ వేదురు జెందెను లేళ్ళు తావిలో
మనికిసశించెఁ దేఁటిదర ♦ మాయిరుమూఁటిని గెల్వ నైదుసా
ధనముల నీవె కావఁదగు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 83

టీ. వనకరి=అడవియేనుఁగు; మైనసకున్=ఒడలిదురదకు, చిక్కెన్=కష్టమందెను, మీను=చేప, వాదవికిన్=నోటిరుచికి; చెడిపోయెన్=చెటాం దెను, చిల్వ=పాము, తాన్=తాను; వినికిలికిన్=పాటవినుటకు; చిక్కెన్=పట్టువడెను, లేళ్ళు = జింకలు, కనువేదురు = కంటిచూపుచెదరుటను, చెందెన్=పొందెను, తేఁటి=తేనెటీగ, తావిలోన్=సువాసనయందు, మనికిన్=ఉండుటవలన; నశించెన్=మరణించెను; ఇరుమూఁటిని=ఈశబ్ద స్పర్శ రూప రస గంధముల నైదింటిని, గెల్వన్=గెల్చుటకు, తరమా = సాధ్యముకాదు, ఐదుసాధనములన్=కన్ను ముక్కు నోరు చెవి చర్మములనెడి యైదుపరికరములతోను, నీవె=నువ్వే, కాపాడఁదగున్=కాపాడవలెను.

తా. శ్రీరామా! అడవియేనుఁగు తనశరీరమందుఁబుట్టిన దురదను చెట్టుగుట్టలకు రాపాడించి రక్తము కారుచున్నను నోర్చుకొనినట్లుండుటచే నట్లే రాపాడుచు కష్టపడును. చేప నోటిరుచి కాసపడి గాలమునకు గట్టిన యెఱను మ్రింగి మరణించును. పాము నాగస్వరము విని పుట్టలోనుండి బయటకు వచ్చి పాములవాని చేతిలోఁ జిక్కిపోవును. జింకలు ఎండమావులను జూచి నీళ్ళని భ్రమపడి పఱుగిడి యాయాసపడును. తేనెటీగ వాసనయందు కోరిక గలదై తామరపువ్వులోఁ జొచ్చి యది మూసుకొనిపోగా కష్టములపాలగును. అందుచే పైనచెప్పిన శబ్దము మొదలగు నింద్రియములను గెల్చుట కెవ్వరికిని సాధ్యముకాదు. నేను త్వక్చక్షుశ్శ్రోత్రఘ్రాణపాశేంద్రియములకు నట్లే చిక్కువడియుంటిని. నన్ను నీవే కాపాడవలయును.

చ. కరములు మీకు మ్రొక్కు లిడ ♦ గన్నులు మిమ్ముఁ నె
చూడ జిహ్వ మీ । స్మరణఁ దనర్ప వీనులు భ ♦ వత్క
థలన్ వినుచుండ నాన మీ । యుఱులను బెట్టు పూసరుల♦
కాసగొనం బరమార్థసాధనో । త్కర మది చేయువే కృపను♦
దాశరథీ కరుణాపయోనిధీ. 84

టీ. కరములు=చేతులు, మీకు=తమకు, మ్రొక్కిడన్ = నమస్కరించుటకును, కన్నులు=నేత్రములు, మిమ్ములను=మిమ్మే, చూడన్=చూచుటకును, జిహ్వ=నాలుక, మీస్మరణన్ = మీ పేరును ధ్యానించుటచే, తనర్పన్=తృప్తినొందుటకును, వీనులు = చెవులు, భవత్కథలన్ = మీకథలను, వినుచుండన్=వినుటకును, నాస=ముక్కు, మీ యురంబునన్ = మీభుజసీమను, పెట్టు=ఉంచుకొను, పూసరులకున్=పూలదండలకును, ఆసగొనన్=ఆసజెందుటకును, కృపన్=దయతో, చేయవే=చేయుమా, అది=అట్లుచేయుట, పరమార్థసాధనోత్కరము = ధర్మార్థకామమోక్షములను సాధించుటకు ఆధారమైనది.

తా. శ్రీరామచంద్రా! నాయందు దయయుంచి నాచేతులు మీకు నమస్కరించునట్లును, కన్నులు మిమ్ములనే జూచునట్లును నాలుక మీ పేరునే ధ్యానించునట్లును, చెవులు తమకథలను వినునట్లును, ముక్కు మీకంఠమున నుంచబడిన పూలమాలలందలి సువాసన జూచునట్లును సేయ ననుగ్రహింపుము. అట్లు చేయుటచే నేను ధన్యుఁడ నగుదును.

చ. చిరతరభక్తి నొక్కతుల ♦ సీదళ మర్పణ సేయువాఁడు ఖే
చరగరుడోరగప్రముఖ ♦ సంఘములో వెలుఁగన్ సదా భవ
త్స్ఫురదరవిందపాదములఁ ♦ బూజ లొనర్చిన వారికెల్లఁ ద
త్పర మటచేతిధాత్రిగద ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 85

టీ. చిరతరభక్తిన్= చాలకాలమునాటిభక్తితో, ఒక్కతులసీదళము= ఒక్కతులసిపత్రము, అర్పణసేయువాఁడు=సమర్పించువాఁడు, ఖేచర = దేవతలు, గరుడ=గరుడులు, ఉరగ=పన్నగులయొక్క; సంఘములోన్ = సమూదాయమందు, వెలుఁగన్=ప్రకాశించుచుండగా, సదా=ఎల్లప్పుడు, భవత్= మీయొక్క, స్ఫురత్=ప్రకాశించు, అరవింద = పద్మములవంటి, పాదములన్=కాళ్ళను, పూజలు, ఒనర్చువారికి=చేయువారికి, ఎల్లన్ = అందరకు;

తత్=ఆ, పరము=మోక్షము, అఱచేతి = అఱచేతియందున్న, ధాత్రిగద= భూమియేకదా!

తా. ఒకఁ డెప్పటినుండియో హృదయమునయున్న భక్తితో నొకతులసీ దళము మీపాదములసన్నిధిని సమర్పించుకొని దేవతలలో ముఖ్యులైనవారియం దొక్కఁడై ప్రకాశించుచుండగా నెల్లప్పుడు మీపాదధ్యానమున మునింగిన వారికి మోక్షము సులభముగా నఱచేతియందుండు భూమివంటిదగదా!

ఉ. భానుఁడుతూర్పునందుఁగను ♦ పట్టినఁబావక చంద్ర తేజముల్
హీనతఁ జెందినట్లు జగ ♦ దేకవిరాజిత మైనసీపద
ధ్యానము సేయుచున్నఁ బర ♦ దైవ మరీచు లడంగకుండునే
దానవగర్వనిర్దళన ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 86

టీ. దానవ=రాక్షసులయొక్క, గర్వ=మదమును, నిర్దళన=బాగుగా భేదించిన రామచంద్రా! భానుఁడు=సూర్యుఁడు, తూర్పునందున్ = తూర్పు దిక్కున, కనుపట్టినన్=కనఁబడఁగా, పావక=అగ్నియొక్కయు; చంద్ర= చంద్రునియొక్కయు, తేజముల్=కాంతులు, హీనతన్ = తక్కువదనమును, చెందినట్లు=పొందినవిధముగా, జగత్=లోకములందు, ఏక=ఒకటిగ, విరాజి తయైన=ప్రకాశమాన మందునట్టిదగు, నీపదధ్యానము=నీపాదములను ధ్యానిం చుట, చేయుచున్నన్ = చేయుచుండగా, పరదైవమరీచులు = ఇతరదేవత లనెడికాంతులు, అడంగకుండునే=అణఁగిపోకుండునా? (అణఁగిపోవును)

తా. సూర్యుఁడు దేదీప్యమానముగఁ దూర్పున నుదయింపఁగనే చం ద్రాగ్నులకాంతులు తగ్గిపోవువిధముగా లోకములన్నింటికి నొక్కండవై ప్రకాశించు నీపాదములను ధ్యానింపగా నితరదేవతలతేజములు తగ్గిపోవును. అనఁగా నిన్నుఁ గొల్చువారి కితరదైవములందు మనస్సు పోదని భావము.

ఉ. నీమహనీయ తత్త్వరస ♦ నిర్ణయబోధ కథామృతాబ్ధిలోఁ
దామును గ్రుంకులాడక వృ♦థాతనుకష్టముఁ జెందిమానవుం
డీమహిలోకతీర్థముల ♦ నెల్ల మునింగిన దుర్వికార హృ
త్తామసపంకముల్ విడునె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 87

టీ. నీమహనీయతత్త్వరస=నీదైన ప్రతిభావంతమగు స్వరూపమనెడి సారముయొక్క; నిర్ణయ=సత్యమును, బోధ=తెలియఁజేయు, కధ=కథలనెడి, అమృతాబ్ధిలోన్=అమృతసముద్రమందు; తాన్ = తాను, మును = ఇంతకు ముందు, గ్రుంకులాడక=మునుఁగక, వృథా=వ్యర్థముగా, తనుకష్టమున్=శరీరాయాసమును, చెంది=పొంది, మానవుండు = మనుష్యుఁడు, ఈమహిన్=ఈ భూమియందు, లోక = కన్పించెడి, తీర్థములన్ = క్షేత్రములను, ఎల్లన్= అన్నిఁటియందును, మునింగినన్=స్నానము చేసినను, దుర్వికార=చెడురూపముగల, హృత్=హృదయమందలి, తామసపంకముల్ = తమోగుణప్రధానములైన కార్యములయొక్క అడుసులు, విడునె=వదలిపోవునా? (వదలవు.)

తా. రామచంద్రా! నీమహనీయరూపం బనెడిసారముయొక్క నిజమును తెలియఁజేయు చరిత్రమనెడి సుధాసముద్రమందు మానవుఁడు మునుఁగక యీభూమియందుఁగల క్షేత్రముల నన్నింటిని శరీరమును శ్రమపెట్టి తిరిగి స్నానతర్పణాదులు వ్యర్థముగాఁ జేసినప్పటికిని మనసునందున పాపమాలిన్యము వదలిపోవునా? ఒక వేళ దేహమాలిన్యము వదలిన వదలునేమోగాని మనోమాలిన్యము వదలిపోదు అని భావము.

ఉ. కాంచనవస్తుసంకలిత ♦ కల్మష మగ్నిపుటంబు వెట్టి వా
రించినరీతి నాత్మ నగు ♦ డించిన దుష్కరదుర్మలత్రయం
బంచితభక్తియోగదహ ♦ నార్చి దగుల్పక పాయునే కన
త్కాంచనకుండలాభరణ ♦ దాశరథీ కరుణాపయోనిధీ 88

టీ. కనత్=ప్రకాశించుచున్న, కాంచన = బంగారువికారము లైన, కుండల=కుండలములు, ఆభరణ = భూషణములుగాఁగల శ్రీరామా! కాంచన వస్త్ర=బంగారుతోఁ జేయఁబడిన నగయందు; సంకలిత = మిళితమైన; కల్మషమూ=మాలిన్యము, అగ్ని పుటంబు= నిప్పునందుఁగొంతకాలముంచి పుటమును, పెట్టి=ఇడి, వారించినరీతిన్=పోఁగొట్టినవిధముగా, ఆత్మన్=జీవుని, నిగుడించిన=గర్విగా కొనరించిన, దుష్కర=చేయకూడని వైన, దుర్మల = చెడుమలము లైన, త్రయంబు=ఈషణత్రయము, అంచిత=ఒప్పుచున్న, భక్తియోగ= భక్తియోగమనెడి, దహనార్చిస్ = అగ్నిశిఖలందు, తగుల్పక = తగులఁబెట్టక, పాయునే=విడిచిపోవునా? (విడువవు)

తా. బంగారుకుండలములను దాల్చిన శ్రీరామచంద్రా! బంగారునగయందుఁ దగిలియున్న మురికిని యగ్నియందుఁ బుటమిడి పోఁగొట్టినతీరుగా జీవుని గర్వసంకలితునిగాఁ జేసిన దుర్మలినంబులగు దారేషణ ధనేషణ పుత్రేషణంబులనెడి యీషణత్రియము భక్తియోగమనెడి యగ్నియందుఁ గాల్పకుండ వదలిపోవవుగదా!

ఉ. నీసతి పెక్కుకల్మి లిడ నేర్పరి ♦ లోక మకల్మషంబుగా
నీసుత సేయుఁ బావనము ♦ నిర్మితకార్యధురీణదక్షుఁ డై
నీసుతుఁ డిచ్చు నాయువులు ♦ నిన్నుభజించిన గల్గకుండునే
దాసుల కీప్సితార్థములు ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 89

టీ. నీసతి = నీభార్యయైన లక్ష్మీదేవి, పెక్కు = అనేకము లైన, కల్మిలు=భాగ్యములు, ఇడన్=ఇచ్చుటకు, నేర్పరి=నేరుపుగలది, నీసుత= నీకూఁతురగు గంగాదేవి, లోకము = ప్రపంచము, అకల్మషంబుగా=పాపరహితమైన [illegible], పావనము=పవిత్రితము, చేయున్=చేయును, నీసుతుఁడు= నీకొమారుఁడైన బ్రహ్మదేవుఁడు, నిర్మితకార్య=సృష్టియొనర్చుటయనెడి పని

యోగ్య, ధురీణ = భారమును వహించుటయందు, దక్షుఁడై = సమర్థుఁడై, ఆయువుల్ = ఆయుర్దాయములు, ఇచ్చెన్ = ఇచ్చెను, నిన్నున్ = నిను; భజించినన్ = కొల్చినచో, దాసులకున్ = భక్తులకు, ఈప్సితార్థములు = కోరినకోరికలు, కల్గకుండునే = తీరకుండునా? (తీరును.)

తా. ప్రభూ! నీకుటుంబమంతయు నేదో యొకవిధముగా లోకరక్షకమైనది. నీభార్యయగు లక్ష్మీదేవి భక్తులకు మహాభాగ్యములను జేకూర్చ నేరుపుకలది. నీకూతురైన గంగాదేవి లోకులపాపములను బోగొట్టి లోకపావని యైయున్నది. నీకుమారుఁడైన బ్రహ్మ సకలచరాచరరూపజీవరాశిని సృష్టించుపనిలో సమర్థుఁడై దీర్ఘాయువుల నిచ్చువాఁడై యున్నాఁడు. కావున వీరి కందరకు రక్షకుఁడవైన నిన్ను సేవించిన భక్తులకోరికలు సిద్ధింపకుండునా? తప్పక సిద్ధించును.

ఉ. వారిజపత్రమం దిడిన ♦ వారివిధంబున వర్తనీయమం
దారయ రొంపిలోనఁ ♦ దనువంటని కుమ్మరపుర్వురీతి సం
సారమునన్ మెలంగుచు వి ♦ చారగుఁడై పర మొందుగాదెస
త్కార మెఱింగి మానవుఁడు ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. వారిజపత్రమందు = తామరాకునందు; ఇడిన = ఉండిన, వారివిధంబునన్ = నీరుమాదిరిగా, వర్తనీయమందు = నడచెడి కార్యమందు, ఆరయ = విచారింపగా, రొంపిలోనన్ = అడుసునందు, తనువు = శరీరము; అంటని = స్పృశింపని; కుమ్మరపుర్వురీతిన్ = కుమ్మరిపురుగువలెనే, మానవుఁడు = మనుష్యుడు, సంసారమునన్ = సంసారమునందు, మెలంగుచు = సంచరింపుచు, విచారగుఁడై = పరబ్రహ్మపదార్థమును వితర్కించువాఁడై; సత్కారము =

పూజలు మొదలగు సేవలు, ఎఱింగి=తెలిసికొని, పరము = మోక్షము, ఒందు
గాదె=పొందునుగదా?

తా. మనుష్యుఁడు నిత్యానిత్యవివేకమనెడి తత్త్వజ్ఞానమును దెలిసి
కొని సంసారమునందుఁ దిరుగుచు నీరు తామరాకును, బురద కుమ్మరిపురుగును
అంటనిరీతిగానే కష్టసుఖముల నంటనివాఁడై నిరంతరము నీకు భక్తుఁడై నీకుఁ
బూజలు మొదలగు కైంకర్యములు చేసి బ్రహ్మజ్ఞానియై మోక్షము
నొందును.

ఉ. ఎక్కడి తల్లిదండ్రి సుతు ♦ లెక్కడివారు కళత్రబాంధవం
బెక్కడిజీవుఁ డెట్టితను ♦ వెత్తినఁ బుట్టుచుఁబోవుచున్నవాఁ
డొక్కఁడె పాపపుణ్యఫల ♦ మొందిననొక్కఁడె కానరాఁడు వే
ఱొక్కఁడు వెంటనంటిభవ ♦ మొల్లనయాకృపఁజూడవయ్యనీ
తక్కరిమాయలం దిడక ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 91

టీ. ఎక్కడి, తల్లి; తండ్రి; సుతులు=బిడ్డలు; ఎక్కడివారు, కళత్ర
బాంధవంబు=భార్యాసంబంధమైన బంధుగులు; ఎక్కడిజీవుఁడు = ఎక్కడి
ప్రాణి, ఎట్టితనువు=ఎటువంటిశరీరము, ఎత్తినన్=ధరించినను, ఒక్కఁడె=
తానొకఁడే; పుట్టుచున్=జననమందుచు, పోవుచున్ = మరణించుచు, ఉన్న
వాఁడు = ఉండువాఁడు, పాపపుణ్యఫలము = మంచిచెడుగులఫలితమును,
ఒందినన్=పొందినను, ఒక్కఁడె=తానొక్కండే; వెంటనంటి = తనవెన్ను
నంటి, వేఱొక్కఁడు=తనకంటె నితరుఁ డెవండును, కానరాఁడు=కాన్పిం
చఁడు; భవము=పుట్టుక; ఒల్లనయా=ఇష్టపడనయ్యా; నీతక్కరిమాయలందు=
నీమోసపుమాయపనులందు, ఇడక=నన్నుంచక, కృపన్ = దయతో, చూడ
వయ్యా=చూడుముమహానుభావా!

తా. రామచంద్రా! ఈతలిదండ్రులు, ఈబిడ్డలు, ఈభార్య, ఆమె బంధువులు వీరందరు నేమిటి? ఇదంతయు మాయ. ఈజీవునకును వారికిని యేమియు సంబంధము లేదు. తా నొక్కఁడే పుట్టుట చచ్చుట పుణ్యము పాపము వీనిఫలితముల నందుచున్నాఁడు. బ్రతికియున్నపు డిందులోఁ దన కెవ్వ రెంత యిష్టులుగా నున్నను తాను మరణించినపుడు తనతో వీరిలో నొకరును రారుగదా? వీరివిషయమున నెంత కష్టపడినను వ్యర్థమేగదా! అందుచే నాకు సంసారపుబెడద పెట్టకుము. నీమాయలలో నన్నుఁ బడవేయక దయయుంచి నాకు మోక్ష మొసఁగి రక్షింపుము.

చ. దొరసినకాయముల్ ముదిమి ♦ దోఁచినఁ జూచి ప్రభుత్వ
ము ల్సిరుల్ । మెఱపులు గాఁగఁ జూచి మఱి ♦ మేదినిలోఁ
దమతోడివారు ముం । దరుగుటఁ జూచి చూచి తెగు ♦
నాయు వెఱుంగక మోహపాశముల్ । దఱుఁగనివారి కేమి
గతి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 92

టీ. దొరసిన=ఉండిన; కాయముల్=శరీరములు, ముదిమి = ముసలితనము, దోఁచినన్=ఎదుటఁబడఁగా, చూచి=కనుఁగొని; ప్రభుత్వముల్=రాచరికములు, సిరుల్=భాగ్యములు, మెఱపులుగాఁగన్ = అస్థిరములయిన మెఱపుతీఁగలుకాఁగా, చూచి, మఱి=ఇంకను, మేదినిలోన్=భూమియందు; తమతోడివారు=తమతో నున్నవారు; ముందు=తనకన్నముందే, అరుగుటన్=మరణించుటను చూచి; తెగునాయువున్=తగ్గిపోయెడి యాయుర్దాయమును, ఎఱుంగక=గ్రహింపక, మోహపాశముల్=మోహమనెడి త్రాళ్ళను; తఱుఁగనివారికి=తెగఁగోయనివారికి; ఏమిగతి=ఏమిత్రోవ.

తా. రామచంద్రా! శరీరము ముడుతలుపడి ముసలితనము వచ్చుటను జూచియు, రాచఱికపుభాగ్యములు మెఱపుఁదీఁగలతో సమానములని భావిం

చుమను, భూమి యందుఁ దనతోఁ బుట్టినవారు తనకన్నముందుగా మరణించుటను జూచుచును, రోజురోజుకు నాయువు తగ్గుచున్నదని తెలియలేక మనుజులు సంసారమనెడి వలత్రాళ్ళలోఁ జిక్కుకొని వాటిని ద్రెంచలేకున్నారు. అట్టివారికి నీకంటె నితరమైన గతియే మున్నది.

ఉ. సిరిగలనాఁడు మైమఱచి ♦ చిక్కిననాఁడు దలంచిపుణ్యముల్
పోరిఁబోరిసేయ నైతి నని ♦ పొక్కినఁగల్గునెగాలిచిచ్చుపైఁ
గెరలినవేళఁ దప్పిఁగొని ♦ కీడ్పడువేళ జలంబు గోరి త
త్తరమునఁ ద్రవ్వఁ జెంగలదె ♦ దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. సిరి=భాగ్యము, కలనాఁడు=ఉన్నప్పుడు, మైమఱచి=శరీరమును మఱచి, చిక్కినవాడు=దరిద్రముచే బాధపడునప్పుడు, పుణ్యముల్ =మంచి పనులు, పోరిఁబోరి=మాటిమాటికి, చేయనైతినని = చేయకపోతినిగదాయని; తలంచి=తలపునకుఁ దెచ్చుకొని, పొక్కినన్ = దుఃఖపడినను, కల్గునె = కల్గునా? గాలి=వాయువు, చిచ్చుపైన్=అగ్నిమీఁద, కెరలినవేళన్ = వీచు సమయమునను; దప్పిగొని=నీరుపట్టుకొని, కీడ్పడువేళన్=బాధపడునప్పుడును, జలంబున్=నీటిని, కోరి = ఆసక్తిపడి, తత్తరమునన్ = తొందరపాటుతో, త్రవ్వఁన్=భూమిని త్రవ్వినను, కలదే=కలదా? (లేదు)

తా. అగ్నిమీద బాగుగా విజృంభించి కాలిపడి గాలి వీచునపు డయ్యగ్నిని చల్లార్చుటకును, బాగుగా దాహము కలిగినప్పుడు దాహమును తీర్చుకొనుటకును బావి త్రవ్వుట యెట్లు నిష్ఫలమో అట్లే భాగ్యములతోఁ దులతూగు నప్పుడు శరీరము మత్తెక్కి పుణ్యకార్యము లాచరింపక దరిద్రదేవత నెత్తిపై నెక్కి తాండవ మాడునప్పుడు మాటిమాటికిని మంచికార్యములు చేయలేక పోతినిగదాయని విచారించినందువలన నేమియు ఫల ముండదు,

ఉ. జీవనమింకఁ బంకమునఁ ♦ జిక్కినమీను చలింపకెంతయుం
దావున నిల్చి జీవనము ♦ దద్దయుఁ గోరువిధంబు దొప్పడం
దావలమైనఁగాని గుఱి ♦ దప్పనివాఁడు తరించువాఁడయా
తావకభక్తియోగమున ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 94

టీ. జీవనము=నీరు, ఇంకన్=ఎండిపోగా, పంకమునన్=బురదలో, చిక్కిన=చిక్కుపడిన, మీను=చేప, ఎంతయున్=కొంచెమైనను; చలింపక=తొట్రుపాటొందక; తావునన్=తానున్న ప్రదేశమునందే, నిల్చి=ఉండిపోయి, జీవనము=నీరు, దద్దయున్=ఎక్కువగా, కోరువిధంబు = కోరెడిరీతి; దొప్పడన్=కలుగునట్లుగా, తావలమైనఁగాని = కష్టములకుఁ బాల్పడినప్పటికిని, గుఱితప్పనివాఁడు=గుఱుతు తప్పనివాఁడు, తావకభక్తియోగమునన్=నీయందలి భక్తియోగముచే, తరించువాఁడయా = ఈసంసారసముద్రము నవలీల దాటగలవాఁ డగునయ్యా!

తా. చేప తా నున్నసరమునందలి యుదకము పూర్తిగా నెండిపోయినను నందలి బురదయందే యుండి తన కాధారమైన నీటికొఱకే యెదురు చూచుచుండెడి విధముగా నెన్ని కష్టములు సంప్రాప్తమైనప్పటికిని నీయందు గుఱుతు తప్పక ప్రవర్తించెడి మానవుఁడు నీయందలి భక్తియనెడి నావచే సంసారంబనెడి యీమహాసముద్రమును నతిసులభముగా దాటగలుగువాఁ డనుట నిస్సంశయము.

చ. సరసునిమానసంబు సర♦సజ్ఞుఁడెఱుంగును మూర్ఖురాధముం
డెఱిఁగ్రహించువాఁడె కొలఁకే ♦ కనివానముగాఁగదర్దురం
బరయఁగ నేర్చునెట్లు విక ♦ చాబ్జమరందరసైకసౌరభో
త్కరముమిళింద మొందుక్రియ♦దాశరథీ కరుణాపయోనిధీ.

టీ. సరసుని=సరస మెఱింగినవాని, మానసంబు=హృదయము, సరసజ్ఞుఁడు=సరసము నెఱింగినవాఁడు, ఎఱుంగును = గ్రహించును, మూఢ్కారాధముఁడు=మూఢులలోకెల్ల తనికిమాలినవాఁడు, ఎఱిఁగి=తెలిసికొని, గ్రహించువాఁడే = సారస్యమును గ్రహింపఁగలఁడా? (గ్రహింపలేఁడు.) కొలకు = సరస్సు, ఏకనివాసము=కప్పకు ముఖ్యముగా నుండుచోటు, కాఁగన్= అయినప్పటికిని, వికచ = బాగుగా వికసించిన, అబ్జ = తామరపూవులందలి, మరందరస = మకరందరసముయొక్క, ఏక = ముఖ్యమగు, సౌరభ = వాసనయొక్క; ఉత్కరము = సముదాయము, మిళిందము = తుమ్మెద, ఒందు క్రియన్=పొందునట్లుగా, దర్దురము = కప్ప, అరయఁగన్ = తెలిసికొనుట, ఎట్లు=ఏవిధముగా, నేర్చున్=నేర్వగలదు? (నేర్వలేదు.)

తా. జ్ఞానియైన మానవుని జ్ఞానవంతుఁడైనవాఁడే తెలిసికొననేర్చును గానిమూఢులలోనధమాధముఁడైనవాఁడు తెలియలేఁడు. కప్పయు తామరపద్మంబును ఒక్కగుంటలోనే యుండినను జక్కగాఁ బుష్పించిన తామరపద్మంబునందలి తేనెవాసనను దూరముగా నుండెడి తుమ్మెద తెలిసికొని యందలి తేనెను గ్రోలగలుగు నేకాని సమీపమందున్న కప్ప దానిజాడనైనను తెలియఁజాలదుగదా! అనగా భగవంతుని దరిత్రమునందలి గొప్పతనమును, మాధుర్యమును భక్తుఁడే తెలిసికొని సంచరించునుగాని యితరుఁ డెఱుఁగలేఁడని భావము.

ఉ. నోఁచినతల్లిదండ్రికిఁ దఁ ♦ నూభవుఁడొక్కఁడె చాలుమేటిచే
 చాఁచనివాఁడు వేఱొకఁడు♦చాఁచిన లేదన కిచ్చువాఁడు నో
 రాఁచినిజంబకానిపలు ♦ కాడనివాఁడు రణంబులోన మేన్
 దాఁచనివాఁడు భద్రగిరి ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 93

టీ. నోఁచిన=అనేకవ్రతములను జేసిన, తల్లిదండ్రికిన్ = జననీజనకులకు, చేచాఁచనివాఁడు=ఇతరులకడ చేయిచాపి నా కిది యమ్మని యాచింపనివాఁడు, వేఁడఁడు = మఱియితరుఁడెవఁడైన, చాఁచినన్=తనవద్ద నా కిది కావలెనని చేయి చాపి యడుగఁగా, లేదనక = నాకడలేదని చెప్పక, ఇచ్చువాఁడు=ఇచ్చెడివాఁడును, నోరాఁచి=నిలుపుకొని, నిజంబకాని=యథార్థముకాని, పలుకు=మాట, ఆడనివాఁడు=చెప్పనివాఁడును, రణంబులోనన్=యుద్ధరంగమునందు; మేన్=శరీరమును, దాఁచనివాఁడు=ఈప్రాణము పోయిననుసరే యిందుండి వెనుక కరుగరాదని యుద్ధము చేయువాఁడును, మేటి=గొప్పవాఁడైన, తనూభవుఁడు=కొడుకు; ఒక్కఁడె = ఒకఁడుండిన, చాలు=చాలును,

తా. ఇతరులను నా కిది కావలెనని చేయి చాపి యడుగనివాఁడును, తన నెవ్వరైన నా కిది కావలెనని చేయిచాపి యాచించినచో నాకడ లేదు నేనీయలేనని చెప్పక వెంటనే యిచ్చువాఁడును, ఎట్టికష్టసమయము వచ్చినను నిజమునే పలుకువాఁడును, యుద్ధభూమియందు శత్రువులకు భయపడి వెనుకంజవేయక యుద్ధమున మరణింపుటో లేక జయమందుటో జరుగవలెనని ధైర్యముతోఁ బోరాడువాఁడును నైన కుమారుఁడు పెక్కువ్రతము లాచరించిన తలిదండ్రులకుండిన వాఁడొక్కఁడే చాలునుగాని యధముల పెక్కురుండిన నేమి లాభము.

ఉ. శ్రీయుత జానకీరమణ ♦ చిన్మయరూప రమేశ రామ నా
రాయణ పాహి పాహి యని ♦ ప్రస్తుతిఁ జేసితి నా మనంబునం
బాయక కిల్బిషవ్రజవి ♦ పాటన మందఁగఁ జేసి సత్కళా
దాయిఫలంబు నాకియవె ♦ దాశరథీ కరుణాపయోనిధీ. 97

టీ. శ్రీయుత=సమస్తసంపదలతోఁ గూడినవాఁడా! జానకీరమణా=సీతాదేవికి మనోహరుఁడైనవాఁడా! చిన్మయరూప=జ్ఞానమయమైన రూపము గలవాఁడా!, రమేశ=లక్ష్మీదేవికిఁ బ్రియుఁడైనవాఁడా!; రామ = శ్రీరామ చంద్రా!, పాహి పాహి యని=నన్ను రక్షింపు రక్షింపుమని, పరిస్తుతిన్ = స్తోత్రమును, చేసితిన్ = చేసితిని; మామనంబునన్ = నాహృదయమునందు, పాయక=విడువక, కిల్బిష=పాపంబులనెడి; వజ్రి = సముదాయముయొక్క; విపాటనము=తెగఁగొట్టుటను, అందఁగన్=పొందగా, చేసి, సత్కళాదాయి ఫలంబు = శ్రేష్ఠతరంబయిన మోక్షమును జేకూర్చునట్టి ఫలితమును; నాకు, ఈయవె=ఒసంగుమా!

తా. శ్రీరామచంద్రా! నీవు సమస్తసంపదలతోఁ దులతూగువాఁడవు, సీతాదేవికిఁ బ్రాణప్రియుఁడవు, చిదానందరూపుఁడవు, లక్ష్మీదేవికి మనోహరుఁడవు నట్టి నిన్ను నన్ను రక్షింపు రక్షింపుమని పదింపదిసార్లు వేడుకొంటిని. నామనమునం దెల్లపుడు నిన్ను విడువకఁ గొల్చితిని. నాపాపంబుల నన్నింటిని సంపూర్ణముగా నశింపఁజేసి నాకు మోక్షసామ్రాజ్యఫలితము నొసంగుము.

ఉ. ఎంతటిపుణ్యమో శబరి ♦ యెంగిలిఁ గొంటివి వింతగాదె నీ
మంతన మెట్టిదో యుడుత♦మైని కరాగ్రనఖాంకురంబులన్
సంతస మందఁ జేసితివి ♦ సత్కులజన్మము లేమి లెక్క వే
దాంతముగాదె నీమహిమ ♦ దాశరథీ కరుణాపయోనిధీ! 98

టీ. శబరియెంగిలిన్=కిరాతస్త్రీయైన శబరి రుచిచూచి విడచిన ఫలమూలను, కొంటివి=భక్షించినావు, ఎంతటిపుణ్యమో = ఆబోయకాంత యెంతటి పుణ్యమును చేసినదో కదా!, వింతగాదె = ఇది యాశ్చర్యవిషయము

గదా!, నీమంతనము=నీయొక్క రహస్యము; ఎట్టిదో = ఎంతనిగూఢమైనదో, ఉడుతమైని = నీచజంతువయిన యుడుతయొక్క శరీరముమీఁద, కర=చేతులయొక్క; అగ్రి=కొనలయందలి; నఖాంకురంబులన్=గోళ్ళకుదుళ్ళచే, సంతసము=సంతోషము, అందన్ = పొందునట్లుగా, చేసితివి = చేసినావు; సత్కులజన్మములు=మంచికులమునందుఁ బుట్టుటలు, ఏమిలెక్క=ఏమియును లెక్కలేదు, నీమహిమ=నీగొప్పతనము, వేదాంతము గాదె = వేదములయంత్యము ను చెప్పునది గదా!

తా. రామచంద్రా! మున్ను నీచకులస్థురాలైన బోయకాంతయగు శబరి తొలిపుట్టువున నెంతమహాపుణ్యము ను జేసినదో తెలియదు. ఆమె తా నెంగిలిచేసిన ఫలముల నీయఁగా నీవు తింటివి. ఉడుతవీపును నీకొనగోళ్ళతో నిమిరి దానిని సంతోషపెట్టితివి. నీరహస్య మెట్టిదో యెవరికిని దెలియరాదు. సర్వసముఁడవై నడచు నీకు జాతిభేదములు లేవు. నీగొప్పతనమే సర్వదా వేదాంతసారమని చెప్పఁబడుచున్నది. ఇందులకు హేతువు విచారించు వారెవరును లేరు.

ఉ. బొంకనివాఁడె యోగ్యుఁ డరి ♦ బృందము లెత్తినచోటఁ
జివ్వకుఁ | జంకనివాఁడె జోదు రథ ♦ సంబున నర్థి కరం
బు సాఁచినం | గొంకనివాఁడె దాత మిముఁ ♦ గొల్చి భ
జించినవాఁడె పో నిరా | తంకమనస్కుఁ డెన్నఁగను ♦ దా
శరథీ కరుణాపయోనిధీ! 99

టీ. బొంకనివాఁడె = అబద్ధ మాడనివాఁడే, యోగ్యుఁడు = మంచి వాఁడు, అరిబృందములు=శత్రుసేనానివహములు, ఎత్తినచోటన్ = దండెత్తి వచ్చినప్పుడు, చివ్వకున్=పోరాటమునకు, జంకనివాఁడె=వెనుదీయనివాఁడే,

జోదు=యుద్ధమును జేయుటకుఁ దగిన యోధుఁడు, రభసంబునన్ = సంతోషముతో, అర్థి=యాచకుఁడు, కరంబు=చేయి, సాఁచినన్ = చాపి నా కిది కావలెనని యడుగగా, కొంకనివాఁడె = ఇచ్చుటకు జంకనివాఁడె, దాత= నిజమైన యీవి గలవాఁడు, మిమ్మును=మిమ్ములను, కొల్చి=ఉపాసనఁజేసి, భజించినవాఁడెపో=సేవల నొనర్చినవాఁడే, ఎన్నఁగను=విచారణసేయఁగా, నిరాంతకమనస్కుఁడు = ఎందులకయినను నడ్డులేని మనస్సు కలవాఁడు.

తా. శ్రీరామచంద్రా! లోకమున నసత్యము పలుకనివాఁడె సత్పురుషుఁడు. శత్రుసేనలు దండెత్తి వచ్చినపు డెంతమాత్రము వెనుకంజవేయక వారిని డీకొని ఘోరాహోరిగఁ బోరువాఁడై, ధైర్యవంతుఁడయినవాఁడే యోద్ధపుబంటు ఏయాచకుఁడయిన వచ్చి చేయిసాఁచి నా కిది కావలెననియడిగినంతనే లేదనకుండ మరల రమ్మనకుండ నాలస్యము చేయక యిచ్చువాఁడే నిజమైన దాత. మిమ్ముఁ గొల్చి సేవించినవాఁడే యెవ్విధంబయిన భయమును బొందని స్వచ్ఛమయిన మనస్సు కలవాఁడు.

చ. భ్రమరము కీటకంబుఁ గొని ♦ పాల్పడి ఝుంకరణోపకా
రిమై । భ్రమరముగా నొనర్చు నని ♦ పల్కుటఁ జేసి భ
వాదిదుఃఖనం । తమున మొడల్చి భక్తిసహి ♦ తంబుగ జీవు
ని విశ్వరూపత । త్వమున ధరించు టే మరుదు ♦ దాశరథీ
కరుణాపయోనిధీ! 100

టీ. భ్రమరము=తుమ్మెద, కీటకంబున్ = పురుగును, కొని = సంగ్రహించి, పాల్పడి=కష్టపడి కార్యయత్న మొనర్ప నుద్దేశించి, ఝుంకరణ = ఝుంకారధ్వనిచే; ఉపకారిమై = మేలు చేకూర్చునదిమై, భ్రమరముగాన్=

తనవిధముగానే తుమ్మెద యగునట్లుగా, ఒనర్చనని=చేయునని, పల్కుటఁ జేసి=చెప్పుటవలన, భవాది=సంసారము మొదలగువానివలనఁ గలుగు, దుఃఖ=వ్యసనము చెడి, సంతమసము=గాఢమైన చీకటిని; ఎడల్చి = కనబడకుండునట్లుగాఁజేసి, భక్తిసహితంబుగన్ = భక్తితోఁగూడను, జీవుని=ప్రాణిని; విశ్వరూపతత్త్వమునన్ = ప్రపంచరూపమైన తమయొక్క నిజస్వరూపమందు ధరించుట=తాల్చుట, ఏమరుదు=ఆశ్చర్యమేమి యున్నది?

తా. అల్పమైన తుమ్మెద యాకుపురుగును సంగ్రహించి తెచ్చి తన గూటిలో నుంచుకొని ఝుంకారధ్వనిని సేయుచు నాపురుగును తనవలెనే చేసికొనుచున్నదని లోకమున ప్రఖ్యాతి కలదు. దీనినిబట్టి చూడగా ప్రపంచస్వరూపుఁడవగు నీవు ప్రాణియొక్క సంసారము మొదలగువానిసంబంధమైన యజ్ఞానము చెడి చీఁకట్లను బోఁదోలి నీవంటివానినిగా నొనర్చి నీసాన్నిధ్యమందే యుంచుకొనుట యనునది గొప్పయాశ్చర్యకరమైన విషయములోనిది కాదు.

చ. తరువులు పూచి కాయ లగుఁ ♦ దత్కుసుమంబులు పూ
జగా భవ । చ్చరణము సోఁకి దాసులకు ♦ సారము లై ధన
ధాన్యరాసు లై । కరి భట ఘోటకాంబరని ♦ కాయము లై
విరజానదీనము । త్తరణ మొనర్పఁ జిత్రి మిది ♦ దాశరథీ
కరుణాపయోనిధీ! 101

టీ. తరువులు=వృక్షములు; పూచి=పూతపట్టి, కాయలగున్=కాయలు కాచును, తత్కుసుమంబులు = ఆవృక్షములందలి పుష్పములు, పూజగా = పూజకొరకుగా, భవచ్చరణము=మీయొక్క యడుగు, సోఁకి=తగిలి; దాసులకు=భక్తులకు, సారములై=సారముగలవియై, ధనధాన్యరాసులై = ద్రవ్యము

వండ్లు వీనియొక్క ప్రోగులై; కరి = ఏనుఁగులును, భట = సేవకులును, ఘోటక = గుఱ్ఱములును; అంబర = వస్త్రములయొక్కయు; నికాయములై = అన్నియు నొక్కటిగాఁ జేరి గుంపులయి; విరజానదీ = విరజయనెడి నది యొక్క, సముత్తరణము = బాగుగా దాటుటను, ఒనర్చు = చేయును, ఇది = ఈసంఘటనము; చిత్రము = ఆశ్చర్యకరమయినది.

తా. చెట్లయందలి పుష్పములను కోయకుండ నట్లే యుంచిన నవి కాయలు కాచునేకాని మఱియేవిధమయిన రూపము నొందఁజాలవు. అట్లు గాక యాపుష్పములను గోసి భగవంతుని పాదార్చనమున కుపయోగించి పూజలు గావించినచో నాపుష్పము లిహలోకమందు ధనధాన్యములను, ఏనుగులు, గుఱ్ఱములు విలువయిన వస్త్రములు భటులు మొదలయిన వైభవము లను బరలోకమున మోక్షమును దప్పక యిచ్చితీరును. అందుచే భగవంతు డయిన శ్రీరామచంద్రుని పాదపూజ విడువక గావించు టత్యావశ్యకము.

అవతారిక:— కవి తా నెవరిని గురువుగా నాశ్రయించి యేరీతిగా హరిభక్తుఁడై యేమంత్రము నుపాసనఁబొంది పునశ్చరణ చేసి శ్రీరామధ్యానమును జేయుచు రామదాసుఁడయ్యెనో దానినీపద్యమున సాదర సాభిమాన విశేషముగాఁ జెప్పుకొనుచున్నాఁడు.

ఉ. పట్టితి భట్టరార్యగురు ♦ పాదము లిమ్మెయి నూర్ధ్వపుండ్రముం । బెట్టితి మంత్రరాజ మొడఁ ♦ బెట్టితి నయ్యమకింకరాళికిన్ । గట్టితి బొమ్మ మీచరణ ♦ కంజములందుఁ

దలంపువెట్టి పో! దట్టితి పాపపుంజములు ♦ దాశరథీ కరుణా
పయోనిధీ! 102

టీ. భట్టరార్య=భట్టరాచార్యులనెడి, గురు = గురువుయొక్క; పాద
ములు=అడుగులు, పట్టితిని=ఆశ్రయించితిని; ఇమ్మెయిన్=ఈశరీరమునందు;
ఊర్ధ్వపుండ్రమున్=నిలువుబొట్టును, పెట్టితి=ధరించితిని; మంత్రరాజము=
నారాయణాష్టాక్షరీమంత్రము, ఒడిన్=ఒడియందు; కట్టితిని=ఉంచుకొంటిని;
అయ్యమకింకరాళికిన్=ఆయమదూతలసమూహమునకు, బొమ్మగట్టితి = అప
జయమును గలుగఁ జేసితిని. మీచరణకంజములందున్ = మీపద్మములవంటి
పాదములందు; తలంపువెట్టి=బుద్ధినిల్పి, పాపపుంజములన్ = పాపరాసులను,
పోన్=పోవునట్లుగా, తట్టితిన్=గెంటివేసితిని.

తా. శ్రీరామచంద్రా! నేను భట్టరాచార్యులనెడి గురువుల కాళ్ళు
పట్టుకొని తిరుమణి శ్రీచూర్ణము దేహమున ధరించి "ఓం నమో నారాయ
ణాయ" యను నారాయణాష్టాక్షరీమంత్రము నుపదేశమును బొంది దానిని
యథావిధిగాఁ బునశ్చరణఁ జేసి యమదూతలకుఁ బరాభవము చేసి నాకడకు
రాకుండ నొనర్చి మీపాదపద్మములనే నిరంతరము హృదయమున నిల్పి
ధ్యానించి నాపాపరాసుల నన్నిటిని బోఁగొట్టుకొంటిని. నా కిట్టి మహో
త్కృష్టముఁ గలుగుటకుఁ గారణములు మొదట భట్టరాచార్యుల నాశ్రయించుట;
తుదిని మీపాదములను నిరంతరము సేవించుట యైయున్నవి.

అవ:—కవి యీపద్యమున తనగోత్రమును తండ్రి
నామధేయంబును తనబ్రాహ్మణశాఖను గృహనామంబును
తనప్రఖ్యాతిని తా నీశతకము నెవరి కంకితమును చేసినదియు

తననామధేయము తనకుఁ గృతిపతియందున్న భక్తి మున్నగు వానిని జెప్పుచున్నాఁడు.

ఉ. అల్లన లింగమంత్రిసుతుఁ ♦ డత్రిజగోత్రజుఁ డాదిశాఖ
కం | చెర్లకులోద్భవుం డనఁ బ్ర ♦ సిద్ధుఁడనై భవదంకి
తంబుగా | నెల్లకవుల్ నుతింప రచి ♦ యించితి గోపకవీం
ద్రుఁడన్ జగ | ద్వల్లభ! నీకు దాసుఁడను ♦ దాశరథీ
కరుణాపయోనిధీ! 103

టీ. అల్లన=తిన్నఁడనముగల, లింగమంత్రిసుతుఁడు=లింగమంత్రికుమారుఁడు, అత్రిజగోత్రజుఁడు=ఆత్రేయసగోత్రమునఁ బుట్టినవాఁడు, ఆదిశాఖ=ప్రథమశాఖ గలవాఁడు; కంచెర్లకుల = కంచర్లవారివంశమున, ఉద్భవుండు=జననమందినవాఁడు, అనన్=అని పొగడగా, ప్రసిద్ధుఁడనై=ప్రఖ్యాతి నొందినవాఁడనై; భవత్ + అంకితంబుగాన్ = మీ కంకితముగా, ఎల్లకవుల్=కవులందరు, నుతింపన్ = కొనియాడువిధముగా; రచియించితిన్ = ఈశతకమును గూర్చితిని, గోపకవీంద్రుఁడన్=గోపన్న యనుపేరుతో నొప్పు కవివర్యుఁడను, జగద్వల్లభ=భూభర్తవైన యోశ్రీరామచంద్రా! నీకు; దాసుఁడను=భక్తుఁడను.

తా. శ్రీరామచంద్రా! నేను ఆత్రేయసగోత్రమందు కంచెర్లవంశమున నుద్భవించి సజ్జనుఁ డనిపించుకొనిన లింగమంత్రికిఁ గుమారుఁడను; ప్రథమశాఖ నియోగిబ్రాహ్మణుఁడు అని పలువురచేఁ గొనియాడఁబడిన ప్రఖ్యాతి గల గోపన్న యనెడి పేరుకల కవివరేణ్యుఁడను. ఈశతకమును లోకవల్లభుండవు, లోకవత్సలుండవు, లోకమాన్యుండవు, లోకపూజ్యుండవు, లోకేశుఁ

డవునైన నీ కంకితముగా రచియించితిని. నేను నీభక్తుండ నగుటఁ గరుణించి యీయంకితమును గ్రహించి నన్ను రక్షింపుము.

## గద్యము

శ్రీమదాత్రేయస గోత్ర పవిత్ర కంచెర్ల కుల పయఃపారావార రాకానిశాకర లింగమంత్రి పుత్త్రుండును శ్రీభట్ట
రాచార్యశిష్యుండును నారాయణాష్టాక్షరీమంత్ర
పూతుండును శ్రీరామదాసుండునయిన
గోపకవి ప్రణీతంబగు
దాశరథీ శతకము
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

---

శాక్సుప్రెస్, రాజమండ్రి- కాపీలు 1000-20-12-45 హా నం. ఇ. జి. 84